# రాయలసీమ కన్నీటిగాథ

మొదటి ప్రచురణ: డిసెంబర్ 1983
రెండవ ప్రచురణ: జనవరి 1984
మూడవ ప్రచురణ: ఏప్రిల్ 2001
నాలుగవ ప్రచురణ: ఏప్రిల్ 2011

హక్కులు: రచయితవి

ముఖచిత్రం: చంద్ర

ముద్రణ:

వెల: రు.10/-

ప్రతులకు:
డా.ఎం.వి.రమణారెడ్డి,
ఖాదరాబాద్ (పి.ఒ.)
ప్రొద్దుటూరు -516362.
కడప జిల్లా
ఫోన్ నెం: 08564 - 251133.

# స్నేహ హస్తం

‘‘కోటిగొంతుల కిన్నెర మీటుకొనుచు, కోటి గుండెల కంజరి కొట్టుకొనుచు, వినిపింతునింక రాయలసీమ కన్నీటి పాటగ’’ అన్న కవి (విద్వాన్ విశ్వం) వాక్కుకు విపులమైన వ్యాఖ్య ఈ చిన్న పుస్తకం. ఒక నిర్దిష్ట చారిత్రిక సామాజిక విషాద ప్రతిఫలనం ఈ పుస్తకం.

రాయలసీమకు జరిగిన అన్యాయం గురించి, ముఖ్యంగా రైతుకు జరిగిన ద్రోహం గురించి, పుడమితల్లికి జరిగిన దారుణం గురించి, చిరకాలంగా, ప్రజా హృదయం ఇప్పటికీ క్షోభిస్తూనేవుంది; ఉద్విగ్న మౌతూనేవుంది; ఆక్రోసిస్తూనేవుంది .... ఇది వ్యక్తిగతమైంది కాదు - సామాజికమైనది. ఈ క్షోభకూ, ఉద్విగ్నతకూ, ఆక్రోశానికీ అక్షరరూపమంటూ ఇస్తే, అది ఎలా వుంటుందీ అంటే, ఇదిగో ఈ పుస్తకంలా ఉంటుంది. ఆ రూపాన్ని ఇచ్చినవారు ఎం.వి.రమణారెడ్డి గారు. అందుకు అర్హమైన చారిత్రిక, సామాజిక, ఆర్థిక నేపథ్యం పట్ల పట్టున్నవారు గాబట్టే, ఆయన రాయలసీమ ప్రజల ఆర్తిని కన్నీటిగాథ రూపంలో గానం చేయగలిగారు. ఒక నిబద్ధతతో, ఒక ధార్మిక ఆవేశంతో, ఒక కళాత్మక స్పందనతో రాయటం వల్లనే రమణారెడ్డిగారి గుండెల నుండి మండిన మంట పంటలా ఈ పుస్తకం ఇప్పటికీ జ్వలిస్తూనేవుంది.

రాయలసీమ వాసులైనంత మాత్రాన, ఇక్కడి జీవితం, ఈ ప్రాంతానికి జరిగిన మోసం, తెలిసి వుంటుందనుకోవటం భ్రమ. అది వాళ్ళ తప్పు కాదు. వాళ్ళకు తెలియ చెప్పని, వాళ్ళను ఉద్విగ్నుల్ని చేయని, ఉద్యుక్తుల్ని చేయని, రాజకీయ పార్టీల, నాయకుల, మేధావుల తప్పు అది! తమకు జరిగిన అన్యాయం ఏమిటో, అది ఎందుకు ఎలా జరిగిందో తెలియచెప్పాల్సిన బాధ్యత చాలామంది మీద వుంది. ఆ బాధ్యతను నెరవేర్చటానికి పూనుకున్నవారు ఎం.వి.ఆర్. సాహిత్య సంస్కారం గలవారు కాబట్టి, చక్కని వాక్యనిర్మాణంతో, సరళమైన సుభోదకమైన శైలిలో, అవసరమైన ఆగ్రహంతో ప్రజల గుండెలు తాకేలా రాశారీ పుస్తకాన్ని! తన ఆలోచనలను, సోదరులంతా పంచుకొనే వెలుగుల రవ్వల జడిగా వర్షించారీ పుస్తకాన్ని!

- రాయలసీమలో 39 లక్షల ఎకరాలకు నీటిపారుదల సౌకర్యం కల్పించే

మెకంజీ పథకం ఎందుకు కనుమరుగైంది?

- రాయలసీమజిల్లాల నీటి అవసరాలను మొదట తీర్చిన తర్వాతనేగాని, ఇతరప్రాంతాలకు నీటి పంపకాల గురించి ఆలోచించకూడదన్న 'శ్రీబాగ్ ఒడంబడిక' ఎందుకు మట్టిగొట్టుకుపోయింది?

- రాయలసీమలో 7.2 లక్షల ఎకరాలకు నీటి సౌకర్యం కల్పించే కృష్ణా -పెన్నార్ ప్రాజెక్టును ఆమూలాగ్రం వ్యతిరేకిస్తూ రాయలసీమ కమ్యూనిస్టులు ఎందుకు ఆందోళన చేశారు?

- మల్లేశ్వరం వద్ద మహోన్నతమైన ఆనకట్ట ద్వారా అనంతపురం లోని ప్రతిఅంగుళాన్నీ పునీతం చెయ్యవలసిన తుంగభద్ర, సర్కారు సోదరుల కుట్ర ఫలితంగా ఎలా చిల్లిముంతగా మారింది?

- 1200 టి.ఎం.సి.ల నీరు కృష్ణానది నుండి వృధాగా తరలిపోతూందని తెలిసి గూడా, రాయలసీమకు నీరివ్వటానికి ఎందుకు చేతులు రాలేదు?

- దుర్భర క్షామపరిస్థితుల్లో మ్రగ్గిపోతూకూడా, రాయలసీమ ప్రజలు నాగార్జున సాగర్ కొరకు, కృష్ణా-పెన్నార్ ప్రాజెక్టును ఎలాటి అమాయకత్వంతో త్యాగం చేశారు?

- కుడి నుండి ఎడమదాకా వున్న రాయలసీమపార్టీలన్నీ కలిసి రాయలసీమకు చేసిన ద్రోహం ఏమిటి?

- ప్రతిరంగంలోనూ రాయలసీమను వెనక్కునెట్టి ప్రజాజీవితాన్ని శవప్రాయం చేసిన రాయలసీమ రాజకీయనాయకులను భావితరాలు క్షమించగలవా?

ఇలాంటి ఎన్నో ప్రశ్నలకూ, సందేహాలకూ సమాధానాలు తెలుసుకుంటే తప్ప రాయలసీమ కన్నీటి గాథకు గల మూలాలు మనకు తెలియవు. చారిత్రిక డాక్యుమెంటులాటి ఈ పుస్తకం సజీవ సాక్ష్యాలతో మనముందు ఎన్నెన్నో సత్యాలను ఆవిష్కరిస్తుంది. ఈ చిన్న పుస్తకాన్ని చదువుదాం - అప్పుడే రాయలసీమను కటిక దారిద్ర్యానికి కట్టిపడవేసిన దాస్యశృంఖలాలను కసిదీరా ఛేదించటానికి ఉద్యుక్తులు కాగలుగుతాము --

అనంతపురం, **సింగమనేని నారాయణ**

08-03-01.

# రాళ్ళసీమ మాగ్నాకార్టా

చరిత్రలో తారీఖులు వొకటే కావచ్చు. కాని అభివృద్ధిక్రమం మాత్రం వొకటి కాదు. సామాజిక, రాజకీయ పరిణామాల దస్తావేజులు వొకటే కావచ్చు. కాని అన్ని పరిణామాల పర్యవసానం వొకటి కాకపోవచ్చు. పాలించే ప్రభుత్వాలు కూడా వొకటే కావచ్చు. కాని పాలితులకు అందే ఫలాలు మాత్రం వొకటి కాదు. సమీపంగానే అన్నంత ఉత్కంఠతో 2020 విజన్ లోంచి స్వర్ణాంధ్రప్రదేశ్ చూస్తున్న వేళ . . . ఎప్పటిలాగే రాయలసీమలో తీతువు కూస్తోంది. తెల్లదొరల నుంచి 'పచ్చ' దొరలదాకా ఏలికలు మారిన దృశ్యం సర్వవర్ణశోభితంగా కనిపిస్తున్నా సీమ ముఖాలు మాత్రం వివర్ణమయేవున్నాయి. చట్టసభల్లో సీమవాటా ఎంత వున్నా, కరువుసీమ అంటూ ఏదో వొక రకం కన్నీరు కురిపించే చుట్టపక్కాలువున్నా ఇవన్నీ అక్కరకురాకుండానే పోతున్నాయి. సీమబతుకుచిత్రం అప్పటి నుంచి ఇప్పటివరకు మారిందేమీలేదు. అభివృద్ధి నినాదాలూ, విధానాలూ వొకే మాదిరిగా వున్నా అవి ఆయా ప్రాంతాలకు సమంగా అందకపోతే ఎలాంటి విపత్కర పరిస్థితి ఏర్పడుతుందో చెప్పడానికి ఇవాల్టి సీమ జీవనమే ఓ ప్రత్యక్షసాక్ష్యం. అసలు జీవితమే స్తంభించిపోయిన విషాదస్థితి వొక గడ్డకట్టిన దృశ్యంలాఎలాంటి చలనమూ లేకుండా కనిపిస్తుంది. దాదాపు రెండు పదుల తరువాత మళ్ళీ మన ముందుకువచ్చిన 'రాయలసీమ కన్నీటి గాథ' చదువుతున్నప్పుడు ఈ స్తబ్దదృశ్యమే అక్షరాల్లో కనిపిస్తుంది. తరతరాలుగా అన్యాయానికీ, అసమానత్వానికీ, రాజకీయ దళారీతనానికీ దగాపడుతున్న సీమలో పీడితుల తరఫున నిలబడి ఉద్యమ స్వరాన్ని వినిపించిన మాగ్నాకార్టా ఇది. ఎమ్వీరమణారెడ్డిగారు 1983లో మొదటిసారిగా వెలుగులోకి తీసుకువచ్చిన ఈ సీమ మాగ్నాకార్టా ఇవాల్టికీ ఎలాంటి సవరణలూ, వివరణలూ అక్కరలేకుండా వొక్క అక్షరం పొల్లుపోకుండా పునర్ముద్రించాల్సిన పరిస్థితి వుందంటే సీమని వొకంగుళం కూడా ముందుకు కదిలించలేకపోయిన అనేక ప్రభుత్వాల, అనేక యంత్రాంగాల, అనేక అభివృద్ధి విధానాల డొల్లతనం ఏమిటో తెలుసుకోవచ్చు.

1983కి ఇంకో నలభయ్యేళ్ళు వెనక్కి వెళ్తే తొలిసీమకథకుడు గుత్తిరామకృష్ణ రాసిన 'గంజికేంద్రం' కథని తలుచుకోవచ్చు. ఆ తెల్లదొరల కాలంలోనూ, పచ్చదొరల కాలంలోనూ కరువుకి పరిష్కారంగా గంజికేంద్రాల తాత్కాలిక మొసలికన్నీరే కారుతున్నప్పుడు కరువు వొక్కటే రాయలసీమకు ఎప్పటికప్పుడు మిగులుతున్న

శాశ్వత చుట్టంలా కనిపిస్తోందన్నది నిజం. ఇంకో పదహారేళ్ళ తర్వాత . . . అంటే స్వాతంత్ర్యం వచ్చిన పదేళ్ళ తర్వాత మరో కవి 'పెన్నేటి' కన్నీటిపాటని హృదయ విదారకంగా వినిపించాడు.

ఇంత మంచి పెన్నతల్లి
ఎందుకెండిపోయెనో
ఇంత మంచి కన్నతల్లి
ఎందుకిట్లు మారెనో?

- అంటూ ప్రశ్నించుకున్న విద్వాన్ విశ్వం, కొన్ని ఇళ్ళల్లో మాత్రమే దీపాలు ఎందుకు వెలుగుతాయో, కొన్ని ఇళ్ళల్లో ఎందుకు వెలగవో కవితాత్మకంగానూ, కథనాత్మకంగానూ చెప్పుకొచ్చారు. ఇదే జీవననేపథ్యంతో ఇంకెన్నో కథలూ వచ్చివుంటాయి. కాని కథలకన్నా, కవిత్వం కన్నా నికృష్టమైన వాస్తవికత సీమలో కనిపిస్తుంది. ఈ వాస్తవికత కూడా సీమజిల్లాలంతటా వొకే విధంగా వుండదు. ఒక్కో జిల్లాదీ, వొక్కో మండలానిదీ వొక్కో విషాదస్థితి. ఆర్థిక, సామాజిక రంగాల్లో కనిపించే వ్యత్యాసాలు లెక్కలేనన్ని. కాబట్టి సీమనంతా వొకే 'వ్యూపాయింట్' నుంచి చూడడమూ సాధ్యం కాదు. కడప కటకటలు వేరు, అనంతపురం కాటకాలు వేరు. చిత్తూరుజిల్లా పరిస్థితి ఇంకా భిన్నంగా వుంటుంది. ఆ యా జిల్లాల పరిస్థితుల్ని బట్టి ఆయా రాజకీయ ప్రాధాన్యాలూ, వైరుధ్యాలూ తప్పనిసరి. సీమకంతా వొకే ఎజెండా వున్నట్టు కనిపించినా, ఆచరణలోకి వచ్చేసరికి వైరుధ్యాలన్నీ బయట పడతాయి. అందుకే రాజకీయపార్టీలు ఏ ఎత్తుగడా వేయలేక కర్రగలవాడిదే బర్రె అన్నట్టుగా వుండిపోతున్నాయి. ఇలాంటి వైరుధ్యాలన్నీ తెలుసు కాబట్టే ఎమ్వీఆర్ వొక రాజకీయవేత్తగా కాకుండా వొక సామాజిక వేత్తగా ఈ 'కన్నీటి గాథ' ను చెప్పుకొచ్చారు. రాజకీయంగా ఆయన ఎటువున్నా మొదట్నుంచీ ఆయన ఈ కట్టుబాటుని వదులుకోలేదు. పార్టీల 'పంథా'కి అతీతంగా ఆయన ఉండగలిగారు. ఆ కారణంగానే ఇప్పటికీ ఆయన ప్రతి పాదనలు కానీ, ఆలోచనా సరళికానీ సామాన్యుడికి ఆమోదయోగ్యంగా కనిపిస్తాయి. ఏ రాజకీయవేత్త హృదయాన్నీ అవి స్పృశించలేకపోవడం వేరే సంగతి. ఆయన ఆలోచన బ్యాలెట్ రాజకీయంలో ఇమడకపోవడం దీనికి వొక కారణంగా చెప్పుకోవచ్చు. అంతగా ఆయన ప్రజల పక్షపాతి కాబట్టే, ''పశువులకు గ్రాసము, మనుషులకు గంజివంటి తాత్కాలిక సహాయ చర్యలపైన మాత్రం శాశ్వతమైన హక్కు రాయలసీమకు మిగిలింది''

అని నీళ్ళు నమలకుండా చెప్పగలిగారు. తాత్కాలిక చర్యల నాటకీయతనీ, రాజకీయతనీ ఎవరైనా అసహ్యించుకోవలసిందే; దానిని మించి అందులో ఇమిడివున్న జలరాజకీయం వింటే వొల్లు జలదరిస్తుంది. నిజంగా సీమవాసు లెవరికైనా గుండెలు మండిపోయే అన్యాయం అది. కాని 'రాజకీయ మౌనం' రాయలసీమకు పెద్ద శాపం. సీమ కరువు చుట్టూ, నీటివనరుల చుట్టూ మొదట్నించీ వొక దగా రాజకీయమే నడిచింది. రాష్ట్రపతులూ, ప్రధానులూ, ముఖ్యమంత్రులూ, ప్రతిపక్షనేతలూ . . . .ఇలా పెద్దపెద్ద హోదాల్లో వెలిగిపోయినవారికి జన్మనివ్వడమో, నిలబెట్టడమో, గెలిపించడమో చేసిన సీమ మట్టికి మిగిలింది గాలికెగిరిపోయే దుమ్ము, గాలి కాలాలూ, నీటిమీద రాతలూ! ఈ విషాదం తెలిస్తే తప్ప రాయలసీమ నాయకుల అవకాశవాదం పైన ఎమ్వీఆర్ చేసిన వ్యాఖ్యలలోని నిజం మనకు గుచ్చుకోదు. 'అందల మెక్కిస్తే అన్నిటినీ వదులుకోటానికి సిద్ధపడే రాయలసీమ నాయకుల బలహీనతను గత 30 సంవత్సరాలుగా వాడుకుంటూ, రాష్ట్ర ఆర్థిక వనరులు యావత్తూ కోస్తాజిల్లాలకే వినియోగించారు. రాయలసీమవాసుల మీసాలను సంపెంగ నూనెతో సంభావించి సంపదనంతా సర్కారుజిల్లాలకు పంచిపెట్టారు' అని ఎమ్వీఆర్ అనడం కొంతమందికి తీవ్రంగా అనిపించినా వాస్తవం అంతకంటే తీవ్రంగా వుందన్నది కఠినవాస్తవం. ఒకప్పుడు వలసవచ్చే ప్రజలకు కాసింత నీడనిచ్చిన సీమ ఇప్పుడు తనే వలసపోయే దుస్థితిలో చిక్కుకోవడం వెనుక ఈ రాజకీయ వైఫల్యం లేదా అని సూటిగానే అడగ వచ్చు. రావాల్సిన నీటి వాటాల్ని కూడా వదులుకుని చుక్కచుక్కకూ సీమ ఎందు  కింత విలవిల్లాడుతూందో ప్రజలు అడగ్గలిగితే సీమనేతల ముఖాల్లో కత్తివేటుకి నెత్తురుచుక్క వుండదు. అలాంటి ప్రశ్నల ఖడ్గహారం ఈ 'కన్నీటి గాథ.'

తాగడానికి చుక్క నీరు లేకపోయినా పౌరుషానికి కొదవలేని సీమ ఇది. కాని, ఉద్యమాల దగ్గరికొచ్చేసరికి ఆ పౌరుషం పిసరంతైనా మిగలదు. నిజానికి అన్నీ వుండి ఏమీ లేనితనాన్ని అనుభవిస్తున్న దుర్భరదారిద్ర్యసీమ. ఆలోచిస్తే . . . సంపద అంతా వొకచోటా, దారిద్ర్యం అంతా మరోచోటా కుప్పపడిపోతున్న స్థితిని ఇక్కడ చూడవచ్చు. నాయకులు తలుచుకుంటే సీమలో జలనిధులుపొంగుకువస్తాయి. చిత్తశుద్ధి వుంటే సీమగొంతు తడపవచ్చు. ఇక్కడి పొలాలకు ఆకుపచ్చ కళ తీసుకురావచ్చు. కచ్చితంగా ఆ లోపాన్నే ఎత్తిచూపించి జలవనరుల జాడ చెప్పే ప్రయత్నం ఈ 'కన్నీటి గాథ'లో కనిపిస్తుంది. ఇప్పటికీ ఆ అంకెలు

పెద్దగా మారలేదని వాస్తవంతో బేరీజువేసుకునేవారెవరికైనా అర్థమవుతుంది. ఎక్కడో పుట్టి ఇక్కడికి వచ్చి సీమపైన ప్రేమ పెంచుకుని సీమ గొంతు తడపాలని తపనపడ్డ తెల్లదొరల పాటి కూడా మన దొరలు చేయలేకపోతున్నారంటే లోపం ఎక్కడుంది? అలాంటి వాళ్ళని చట్టసభలకు ప్రతినిధులుగా పంపించుకుంటూ శాపం అనుకునే కర్మసిద్ధాంతం ప్రజలకెందుకు?

రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలూ ఎంతోకొంత అభివృద్ధి ఫలాల్నీ, తమ వాటా జలాల్నీ దక్కించుకుంటున్నప్పుడు సీమలో మాత్రం కుడి, ఎడమలు దగా, దగా, దగా అనే పరిస్థితి ఎందుకు? మన వాటా జలాల్ని రాబట్టుకోలేకపోవడంలో మన వాటా పాపం ఎంతో, శాపం ఎంతో తేల్చుకుని అధికార రాజకీయాల జలకుట్రని భగ్నం చేయాల్సిన సమయం ఇది. లేకపోతే ఇప్పటికే మొదలైన ఎడారి, దిగమింగడం ఖాయం. అలాంటి పునరుద్యమానికి ఎమ్వీఆర్ కన్నీటి గాథ పునర్ముద్రణ మరో ప్రేరణ . . . !

**-అప్సర్**

# రాయలసీమ కన్నీటి గాథ

రాయలనాటి వైభవంతో రతనాలసీమగా ఖ్యాతి పొందిన రాయల సీమజిల్లాలు ఈనాడు కటిక దారిద్ర్యానికి ఆలవాలమైనాయి. పాడిపంటల సౌభాగ్యంతో తెలుగు జాతికి బిక్షం పెట్టిన ఈ ప్రజలు నేడు కరువు కాటకాల వాతబడి 'అన్నమో రామచంద్రా' అని అలమటిస్తున్నారు. జాలిలేని మేఘాలు రాయలసీమ వాసుల కడగండ్ల పట్ల కన్నీటి చుక్కలైనా రాల్చిపోవడం లేదు. శాపగ్రస్తమైన ఈ సీమను దాటినంత వరకు ఋతుపవనాలు వర్షించవు. ఒడ్లను వొరుసుకుంటూ ప్రవహించే జీవనదులు ఈ ఎల్లలు విడిచినంత వరకు ఉపయోగపడవు. ఆకాశగంగ ఆదరణ లేక, పాతాలగంగ నోటికందక, షుమారు 150 సంవత్సరాలనుండి రాయలసీమ జిల్లాలు కరువు రాక్షసికి కాపురాలుగా మారాయి. ప్రతిఏటా ఏదో వొక మూల కరువు; మూడు సంవత్సరాలకొకసారి ప్రతిచోటా కరువు. వేలాది గ్రామాలకు మంచినీరు కరువు. మిగిలిన చోట్ల 200 అడుగుల లోతువరకు రిగ్గు వేస్తే తప్ప త్రాగునీరు కరువు. భారతదేశంలోని కరువుల చరిత్రే రాయలసీమ; రాయలసీమ చరిత్రే కరువు.

విజయనగర రాజుల కాలానికి అభివృద్ధి చెందిన సాంకేతిక పరిజ్ఞానం పరిమితమైంది. భారీ ఆనకట్టల నిర్మాణం వారికి తెలియదు. విద్యుచ్ఛక్తి ఏమిటో అప్పట్లో ఎరుగరు. మిట్టపల్లాలను లెక్కగట్టగల ఆధునిక పరికరాలు వారికి లేవు. వారికున్నదల్లా ప్రజాసంక్షేమం పట్ల అకుంఠిత దీక్ష. అను భవపూర్వకంగా గ్రహించిన విజ్ఞానం మేరకు వీలైన ప్రతిచోటా చెరువులు నిర్మించారు. నీటిపారుదల సౌకర్యాలకోసం ఖజానా నుండి చేసే ఖర్చుగాక, విజయనగర రాణులు తమ ఆభరణాలు అమ్మి ప్రజాసంక్షేమానికి తోడుపడ్డారు. కాలువల ద్వారా వ్యవసాయం సాధ్యపడని కొండప్రాంతాల్లో భూగర్భజల నిక్షేపాల రక్షణకై జలాశయాలు (percolation tanks) నిర్మించారు. తమ ఔదార్యంతో దేశాన్ని సుభిక్షం చేశారు. రాయలసీమ రైతును అన్నదాతగా చేశారు.

అంగళ్ళలో రతనాలు అమ్మిన వైభవం రాయలతో పాటు గతించింది.

ఆలన లేని నీటిపారుదల వసతులు, పాలనలేని రాయలసీమ ప్రజలు శిథిల మౌతూ వచ్చారు. దీనికితోడు జనాభా పెరుగుదల, వర్షపాతం తగ్గుదల తోడైనాయి. స్థిరత్వం లేని ముస్లిం రాజుల ఏలుబడి, దాని తరువాత హృదయం లేని బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ పరిపాలన రాయలసీమ జిల్లాల మూలుగులు పీల్చివేశాయి. కరువులూ కష్టాలూ రాయలసీమ గడప మీదికి వచ్చి కూర్చు న్నాయి.

1858లో కంపెనీ పరిపాలన అంతమై, దేశం బ్రిటిష్ సింహాసనం ఏలుబడి క్రిందికి వచ్చినంత వరకు రాయలసీమ జిల్లాలు ఏ విధంగా బ్రతికాయో పట్టించుకున్న నాథుడు లేడు. 1876లో సంభవించిన దారుణమైన ధాతు కరువు రాయలసీమ ప్రజలను గగ్గోలు పరిచింది. పరాయి పాలకులను సైతం కరగించిన ఈ కరువు నూటికి నలభైమంది ప్రజానీకాన్ని పొట్టన పెట్టుకుంది.

ధాతు కరువుతో కళ్ళు తెరిచిన బ్రిటిష్ ప్రభుత్వం ప్రజలకు తాత్కాలిక సహాయ చర్యలు చేబట్టడమేగాక, పలురకాల పరిశోధనలు గూడా జరిపించింది. ఈ పరిశోధనల మూలంగా రాయలసీమ ప్రాంతం అతిత్వరలో ఎడారిగా మారడానికి సిద్ధంగా వుందని స్పష్టమైంది. సర్ ఆర్థర్ కాటన్, సర్ మెకంజీ వంటి బ్రిటిష్ ఇంజనీర్లు రాయలసీమకు నీటిపారుదల సౌకర్యాలను కల్పించే అవకాశాలకోసం పరిశోధనలు ప్రారంభించారు. గుర్రాలమీద సిబ్బందితో ప్రయాణంచేసి నదులు, కొండలు, గుట్టలు క్షుణ్ణంగా సర్వే చేశారు. రాయల సీమజిల్లాలలో సాగులోవున్న మొత్తం 74 లక్షల ఎకరాలకుగాను 39 లక్షల ఎకరాలకు నీటిపారుదల కల్పించే పథకాలను రూపొందించారు.

1890లో సర్ కాటన్ రూపొందించిన కర్నూలు-కడప కాలువ నిర్మించ బడింది. దీని మూలంగా కర్నూలు జిల్లాలో 1 లక్షా 84 వేల ఎకరాలకు, కడపజిల్లాలో 94 వేల ఎకరాలకు నీటి సౌకర్యం కల్పించబడింది. కృష్ణ, తుంగభద్ర, పెన్నా నదుల సంగమంతో సర్ మెకంజీ రూపొందించిన బృహత్పథకంతో రాయలసీమ జిల్లాలలో (ఆనాడు కర్నూల్, కడప, అనంత పురం, బళ్ళారి జిల్లాల్లో) మొత్తం 36 లక్షల ఎకరాలకు నీటిపారుదల ఏర్పడు తుంది. ఈ పథకానికి రూపకల్పన జరిగేవుంటే, రాయలసీమ జిల్లాలు

ఆంధ్రదేశానికి మకుటాయమానంగా ప్రకాశించిఉండేవి. కానీ, 1919లో మొదటి ప్రపంచయుద్ధం, తరువాత 1945 వరకు రెండవ ప్రపంచయుద్ధంలో కూరుకు పోయిన బ్రిటిష్ ప్రభుత్వం ఈ ప్రాజెక్టు పట్ల శ్రద్ధ చూపలేక పోయింది. 1947లో బ్రిటిష్ పాలనతోపాటు మెకంజీ పథకం గూడా తెరమరుగైంది.

1953 వరకు ఆంధ్రప్రాంతం (కోస్తా, రాయలసీమ జిల్లాలు) మద్రాసు రాష్ట్రంలో భాగంగా వుండేది. రాష్ట్రప్రభుత్వ పరిపాలనలో తమిళుల ఆధిపత్యం తెలుగువారు సహించలేనంత అధికంగా వుండేది. రాష్ట్ర ఆదాయాల విని యోగం, ఉద్యోగావకాశాలూ, విద్యాసౌకర్యాలూ మొదలైన విషయాల్లో అత్యధికభాగం తమిళులకే దక్కుతూండేది. మద్రాసురాష్ట్ర పరిపాలనలో ఆంధ్రుల పరిస్థితి రెండవశ్రేణి పౌరుల స్థాయికి దిగజారిపోయింది. దీనివల్ల, స్వరాజ్యోద్యమంతోబాటు ఆంధ్రదేశంలో ఆంధ్రోద్యమానికి గూడా బీజాలు పడ్డాయి. 1913లో బాపట్లలో మొదటి ఆంధ్రమహాసభ జరపబడింది. 1915లో విశాఖలో జరిగిన తృతీయమహాసభలో 'ప్రత్యేక తెలుగురాష్ట్రం' కావాలని బహిరంగంగా తీర్మానించబడింది. ఆంధ్రరాష్ట్ర నిర్మాణంలో రాయలసీమ భాగంగా వుండాలా వద్దా అన్న మీమాంస ఆంధ్రమహాసభల నాటినుండి ప్రారంభమైంది. కోస్తా ఆంధ్రులతో కలిసి ప్రత్యేకరాష్ట్రంగా ఏర్పడటం పట్ల రాయలసీమ వాసులలో మొదటినుండి భయసందేహాలు వుంటూవచ్చాయి. 1926లో ఏర్పడిన ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని వాల్తేరులో నెలకొల్పిన సంద ర్భంగా జరిగిన తతంగం రాయలసీమవాసుల సందేహాలను ధృవపరచడానికి తోడ్పడింది.

'సాధన' పత్రిక సంపాదకులూ, రాయలసీమ మేధావుల్లో వొకరైన కీ.శే. పప్పూరు రామాచార్యులుగారు - ''భాషాప్రయుక్త రాష్ట్రములు అక్కరలేదనను. అందువల్ల లాభములనేకములు గలవు. కాని, చెన్న రాజధాని (మద్రాసు) నుండి ఆంధ్రరాష్ట్రము విడువడుట లాభకరమైనచో, ఆంధ్రరాష్ట్రము నుండి రాయలసీమ విడువడుట మరింత లాభము గదా! . . . . ఆంధ్ర విశ్వవిద్యాలయము విషయములో (వారి ప్రవర్తన) మా కర్థమైనది. వారిలో వారే కలహించినారని అధ్యక్షులు తెలిపినా, మా కియ్యగూడదనుటలో అందరూ ఏకీభవించినవారే. . . . కావున, ఉత్తరాదివారితో చేరుటకన్నను

వేరు రాష్ట్ర స్థాపనకు గడంగుట మేలు.'' అని అభిప్రాయపడ్డారు.

21 జూన్ 1931 లో ఈ విషయంపై కీ.శే. కడప కోటిరెడ్డిగారి అధ్యక్షతన జరిగిన బహిరంగసభలో టి.ఎన్. రామకృష్ణారెడ్డిగారు ప్రసంగిస్తూ - ''దక్షిణ జిల్లాలవారి అధిపత్యం వల్ల నిన్నటి దినముల వరకు అనుభవించిన బాధను మనం మరువలేము. ఇక ఇప్పుడు ఉత్తరాది ప్రాబల్యము రుచి చూచుచున్నాము. మేమొక వ్యక్తుల మన్న గణనగూడా వారికి లేదు. మనము వారికి లెక్కకురాము. రాష్ట్ర రాజధాని మనకు రాదు. దానికి అప్పుడే ప్రయత్నములు జరుగుచున్నవి.'' అన్నారు.

రాయలసీమ ప్రజల్లో ఏర్పడిన భయసందేహాలను తొలగించడానికి ఆంధ్రోద్యమ నాయకులైన కొండా వెంకటప్పయ్య, భోగరాజు పట్టాభి సీతారామయ్యగార్లు తీవ్రంగా కృషి చేశారు. 30 అక్టోబరు 1937న విజయవాడలో జరిగిన ఆంధ్ర మహాసభ రజతోత్సవాలలో రాయలసీమ నాయకులను ఏనుగు అంబారీలపై ఊరేగించారు. ఐనా, సన్మానాలకూ, సంభావనలకూ సమ్మోహితులుగాని పప్పూరు రామాచార్యుల వంటి మొండిఘటాలవల్ల వ్రాత పూర్వకమైన వొక వొప్పందం చేసుకొనక తప్పలేదు.

16 నవంబరు 1937న దేశోద్ధారక నాగేశ్వరరావుగారి నివాసమైన 'శ్రీబాగ్' భవనంలో కోస్తా, రాయలసీమ ప్రాంతాలకు చెందిన నాయకులు వొక 'పెద్దమనుషుల వొప్పందం' కుదుర్చుకున్నారు. అదే 'శ్రీబాగ్ వొడంబడిక.'

శ్రీభాగ్ వొడంబడిక ప్రకారం ఆంధ్రవిశ్వవిద్యాలయానికి ఒక కేంద్రం విశాఖపట్నం లోనూ, మరొక కేంద్రం అనంతపురం లోనూ ఏర్పాటు చేయాలి. నీటిపారుదల పథకాలలో పది సంవత్సరాలుగాని, అవసరమైనచో అంతకంటే ఎక్కువ కాలం గానీ రాయలసీమ జిల్లాలకే ప్రాముఖ్యత ఇవ్వాలి. ముఖ్యంగా కృష్ణా, తుంగభద్ర, పెన్నా నదుల నీటి వినియోగం కొరకు ఉపయోగపడే భారీపథకాలు ఈ జిల్లాల కొరకే కేంద్రీకరించాలి. పై నదుల నీటి పంపకం విషయంలో వివాదం ఏర్పడినప్పుడు, రాయలసీమ జిల్లాల అవసరాలను మొదట తీర్చాలి. సమాన సంఖ్య ప్రాతిపదికపై అసెంబ్లీ సీట్లు ఏర్పాటు చేయాలి. రాష్ట్ర రాజధానిగాని, హైకోర్టుగాని - దేనిని రాయలసీమ ప్రజలు ఎన్నుకుంటే దానిని రాయలసీమ ప్రాంతంలో నెలకొల్పాలి.

1944లో ఉమ్మడి మద్రాసు రాష్ట్రానికీ, నిజాం ప్రభుత్వానికీ మల్లేశ్వరం వద్ద తుంగభద్ర ఆనకట్ట నిర్మించేందుకు ఒప్పందం కుదిరింది. అయితే, మెకంజీ పథకంలోని ఆనకట్టకూ దీనికీ ఏమాత్రం పోలికలేదు. ఆంధ్రోద్యమం పట్ల అసహనం కలిగిన మద్రాసు ప్రభుత్వం, ప్రజాసంక్షేమం పట్ల నిమగ్నత లేని నిజాంప్రభుత్వం నిర్వహించిన ఈ ఆనకట్ట 1956లో మరుగుజ్జు రూపంతో పూర్తిచేయబడింది. రాయలసీమకు జరిగిన అన్యాయాల్లో ఇది మొట్టమొదటిది. రాయలసీమకు అంబారీలు కట్టించిన ఆంధ్రోద్యమ నాయకులు దీనికి అభ్యంతరం తెలపలేదు. తుంగభద్రలో మిగిలిన నీరంతా కోస్తా జిల్లాలకు వస్తాయని సంతోషపడ్డారు.

1947లో భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రకటించినప్పుడు మద్రాసు రాష్ట్రవిభజన జరగలేదు. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రాన్ని ఆశించిన తెలుగు ప్రజల్లో అసంతృప్తి చెలరేగింది. ఆంధ్రరాష్ట్ర సాధన కోసం తీవ్రమైన ఉద్యమం బయలుదేరింది. శ్రీబాగ్ ఒడంబడిక తరువాత రాయలసీమ ప్రజలుగూడా ఆంధ్రోద్యమంలో మనస్ఫూర్తిగా పాల్గొంటూవచ్చారు.

1951లో ఉమ్మడి మద్రాసురాష్ట్రం కృష్ణా-పెన్నార్ ప్రాజెక్టును రూపొందించి, ప్లానింగ్ కమిషన్ అనుమతి పొందింది. దీనివల్ల కర్నూలుజిల్లాలో 2.5 లక్షల ఎకరాలూ, కడపజిల్లాలో 4 లక్షల ఎకరాలూ (కె.సి.కెనాల్ ఆయకట్టుకు అదనంగా), చిత్తూరుజిల్లా(అప్పటి ఉత్తర ఆర్కాట్ )లో 70 వేల ఎకరాలూ, నెల్లూరుజిల్లాలో 7 లక్షల ఎకరాలూ (సంగం ఆనకట్ట సాగులో వున్న భూములతో కలిపి) సాగులోకి వచ్చేది. చెంగలపట్టు తదితర తమిళ ప్రాంతాల్లో 10 లక్షల ఎకరాలు సాగవుతుంది. రాయలసీమజిల్లాలలో సాగయ్యే 7.2 లక్షల ఎకరాలు కేవలం ఆరుతడి పైరు కాదు. ఇందులో ఇరుగారు తరి 1/3వ భాగం వుంది.

ఉమ్మడి మద్రాసు ప్రభుత్వానికి ఈ పథకం చేపట్టడంలో స్వార్థం వుండవచ్చు: కానీ, దీనివల్ల రాయలసీమలోని మూడు జిల్లాలకు షుమారు 100 టి.ఎం.సి.ల కృష్ణ నీరు లభించి వుండేది. రాయలసీమకు కలిగే ఉపయోగాన్ని మరుగుపరిచి, తమిళనాడు లోని 10 లక్షల ఎకరాల ఆయకట్టును ఎత్తిచూపి, కృష్ణనీటినంతా అరవదేశానికి పారగట్టడానికి జరిగిన కుట్రగా

కృష్ణా-పెన్నార్ ప్రాజెక్టును వర్జించారు సర్కారుజిల్లాల నాయకులు. తమిళ ద్వేషం తలకెక్కిన రాయలసీమ జిల్లాలవారు సోదరాంధ్రుల మాటలు నమ్మి, కృష్ణా - పెన్నార్ ప్రాజెక్టును వ్యతిరేకించారు. కృష్ణానది నీటిలో షుమారు 400 టి.ఎం.సి.ల నీరు సర్కారుజిల్లాల సరిహద్దులు చేరకముందే ఖర్చవు తున్నాయని కోస్తా నాయకులు గ్రహించినంత చురుకుగా రాయలసీమ నాయకులు గమనించలేక పోయారు. కడప కోటిరెడ్డి, రామాచార్యులు, ఓ.పుల్లారెడ్డి వంటి నాయకుల సలహాను పెడచెవినిబెట్టి, రాయలసీమ ప్రజలను తప్పుదారి పట్టించిన బాధ్యత (నేరం) కమ్యూనిస్టుపార్టీదేనని చెప్పక తప్పదు. రాయలసీమ కమ్యూనిస్టులకు ఏ మాత్రం ఇంగితమున్నా కృష్ణా-పెన్నార్ ప్రాజెక్టులో కర్నూలు, కడప, నెల్లూరు, చిత్తూరు జిల్లాలకు వర్తించే భాగం మేరకు అమలు చేయమని అడిగివుండవచ్చు. తమ సర్కారుజిల్లా నాయకులు అంతర్జాతీయతను జీర్ణించుకున్నవారనీ, ప్రాంతీయతత్వానికి అతీతులనీ నమ్మిన రాయలసీమ కమ్యూనిస్టులు కృష్ణా-పెన్నార్ ప్రాజెక్టును ఆమూలాగ్రం వ్యతి రేకిస్తూ ఆందోళన చేశారు. దాని స్థానంలో రాయలసీమకు చుక్క నీరైనా దక్కని నాగార్జునసాగర్ కావాలని సర్కారువారితో కలిసి కేకలేశారు. కానీ, ఈనాడు రాయలసీమకు రావలసిన న్యాయమైన వాటాను గురించి కమ్యూనిస్టు పార్టీలు ఎందుకు ఆందోళన చేయవో, వాటి అంతర్జాతీయ సిద్ధాంతం ఏమైపోయిందో వారికే తెలియాలి. మొత్తంమీద రాయలసీమవాసులు తమ చేతులతో తమ గొంతు కోసుకున్నట్టయింది. ఇది రాయలసీమకు జరిగిన రెండో అన్యాయం.

1953లో ఆంధ్రరాష్ట్రం అవతరించింది. బళ్ళారిజిల్లాలో అధికప్రాంతం మైసూరు రాష్ట్రానికి (నేటి కర్ణాటక) చేరగా, అనంతపురం-కర్నూలు-కడప-చిత్తూరు జిల్లాలు కలిగిన రాయలసీమప్రాంతం కోస్తాజిల్లాలతో కలిసి 'ఆంధ్రరాష్ట్రం' అయింది.

ఆంధ్రరాష్ట్ర అవతరణవల్ల రాయలసీమకు నెరవేరిన కోరిక వొక్కటే వొక్కటి. అది కర్నూలు రాజధాని కావటం. ఇదైనా సవ్యంగా సమకూరిందా అంటే అదీలేదు. 1952 జూన్‌లో పార్లమెంటు 'ఆంధ్రాస్టేట్ బిల్లు' ఆమో దించగానే, ఈ కొత్తరాష్ట్రానికి మద్రాసును అతిథిరాజధానిగా వుంచి, గుంటూరు

విజయవాడల మధ్య శాశ్వత రాజధానిని ఏర్పాటు చేయడానికి ప్రయత్నాలు జరిగాయి. రాజధానిని రాయలసీమలో వుంచకపోతే రాజీనామాలు చేయటానికి రాయలసీమ శాసనసభ్యులు సంసిద్ధులయ్యారు. రాజధాని సమస్యను పరిష్కరించటానికి ప్రకాశంపంతులుగారి అధ్యక్షతన శాసనసభ్యుల సమావేశం ఏర్పాటు చేయబడింది. కోస్తా శాసనసభ్యులు గుంటూరు-విజయవాడల మధ్య రాజధాని ఏర్పాటు చేయాలని పట్టుబట్టారు. చివరకు నిర్ణయాధికారం ప్రకాశంగారికి వదిలేస్తూ సమావేశం ముగిసింది.

ప్రకాశంపంతులుగారు కర్నూలులో రాజధాని వుండాలని నిర్ణయించారు. కోపోద్రిక్తమైన కోస్తాజిల్లాల వాతావరణం విజయవాడలోని ప్రకాశంపంతులుగారి విగ్రహాన్ని కూలదోయడానికి పూనుకుంది. దానికి సమాధానంగా ప్రకాశం పంతులు గారు ఇలా అన్నారు -

"కర్నూలు శాశ్వత రాజధాని కాదు. ఇది తాత్కాలికమైనది. త్వరలో విశాలాంధ్ర ఏర్పడగలదన్న విశ్వాసం నాకుంది. అప్పుడు హైదరాబాదు మనకు శాశ్వత రాజధానిగా వుంటుంది."

ఆంధ్రరాష్ట్ర అవతరణ వల్ల వచ్చిన తాత్కాలిక వైభవం కోసం రాయలసీమ పోగొట్టుకున్నవి ఏమిటి? - తుంగభద్ర నీటితో ఎటుజూసినా సస్యశ్యామలం గావలసిన అనంతపురంజిల్లా పచ్చగడ్డికిగూడా నోచుకోని స్థితికి చేరుకుంది; కృష్ణాజలాలతో ఇరుగారు సంపదలు అనుభవించవలసిన కర్నూలు,కడప, చిత్తూరు జిల్లాలు మంచినీటికై మొరబెట్టుకోవలసిన స్థితికి చేరుకున్నాయి. పశువులకు గ్రాసము, మనుషులకు గంజి వంటి తాత్కాలిక సహాయచర్యలపైన శాశ్వతమైన హక్కుమాత్రం రాయలసీమకు మిగిలింది. నాగార్జునసాగర్ నిర్మాణానికి 1954లో తెలంగాణా, ఆంధ్రరాష్ట్రాల మధ్య జరిగిన వొప్పందం మూలంగా రాయలసీమ నీటిపారుదల పథకాలకు శాశ్వత సమాధి జరిగింది. అదే సంవత్సరంలో తుంగభద్ర జలాలు, విద్యుత్తు వాటాల పంపిణీలో విద్యుచ్ఛక్తి 80% జలాలు 20% మన వాటాగా కోరుకుని, మైసూరు రాష్ట్రానికి 80% జలాలు, 20% విద్యుచ్ఛక్తి ఇవ్వడానికి అంగీకరించడం మూలంగా రాయలసీమకు రావలసిన తుంగభద్రనీటిని శాశ్వతంగా పోగొట్టుకోవలసి వచ్చింది. 1956లో విశాలాంధ్ర ఏర్పడటంతో, రాజధాని హైదరాబాదుకు

మారి, రాయలసీమ రాజధాని వైభవం మూడేండ్ల ముచ్చటగా ముగిసింది. దీని కోసమై పోగొట్టుకున్నవి మాత్రం తిరిగిరాలేదు.

రాయలసీమ నాయకుల్లోని ముఠా తగాదాలూ, పదవీ వ్యామోహం, కీర్తి కండూతి కోస్తాజిల్లాల నాయకులకు మరింత అవకాశాన్నిచ్చాయి. అందల మెక్కిస్తే అన్నిటినీ వదులుకోటానికి సిద్ధపడే రాయలసీమ నాయకుల బలహీనతను గత 30 సంవత్సరాలుగా వాడుకుంటూ, రాష్ట్ర ఆర్థికవనరులు యావత్తు కోస్తాజిల్లాలకే వినియోగించారు. రాయలసీమవాసుల మీసాలను సంపెంగ నూనెతో సంభావించి సంపదనంతా సర్కారుజిల్లాలకు పంచిపెట్టారు.

1953లో ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన నాటినుండి రాయలసీమ ఎంత నిర్లక్ష్యానికి గురిచేయబడిందో అంచనా వేస్తే రాయలసీమ నాయకులెవ్వరిని భావితరాలు క్షమించవు. నదీజలాల వాటాను పోగొట్టి పైర్లను ఎండగట్టారు; ఉద్యోగావకాశాలను చేజార్చి చదువుకున్నవారిని మాడగట్టారు; విద్యాసౌక ర్యాలను నిర్లక్ష్యం చేసి ప్రజాచైతన్యాన్ని తొక్కిపట్టారు; వైద్యసౌకర్యాలకు దూరంచేసి రోగులను చావగొట్టారు; ఇది అది అని చెప్పనవసరం లేకుండా ప్రతిరంగంలోనూ రాయలసీమను వెనక్కు నెట్టి ప్రజాజీవితాన్ని శవప్రాయం చేశారు.

ఇన్ని బాధలకు లోనైన రాయలసీమ, ఇంత నిర్లక్ష్యానికి గురైన రాయలసీమ, ఇన్ని త్యాగాలు చేసిన రాయలసీమ, ఈనాడు ఎండిన గొంతుతో నీళ్ళు కావాలని అడిగితే, కృష్ణాజలాల మీద మీకు హక్కే లేదని నిర్దాక్షిణ్యంగా గెంటివేస్తున్నారు. 1200 టి.ఎం.సి.ల నీరు కృష్ణానది నుండి వృధాగా సముద్రంలో కలిసిపోతూందని తెలిసిగూడా రాయలసీమకు నీరివ్వడానికి చేతులు రావటంలేదు. “No man has a right to waste one drop of water that another man can turn into bread” - Brishan Young. అంటే, మరొకరి తిండిగా మారే ఏ చుక్క నీటినైనా ఇంకొకడు వృధా చేసే హక్కు లేదు అని. కృష్ణా-గోదావరి ట్రిబ్యునల్ ఎదుట ఘనత వహించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వక్కాణించిన ధర్మసూక్తి ఇది. మరి కృష్ణాబ్యారేజి నుండి 1200 టి.ఎం.సి నీటిని సాలీనా వృధాచేసే హక్కు ఈ ప్రభుత్వానికి ఎవరిచ్చారు?

రాయలసీమకు కృష్ణాజలాలపై ఏమి హక్కుందని అడుగుతున్నారా? మా కరువు పీడిత పరిస్థితే మా మొదటి హక్కు.

“The areas subject to frequent scarcity of famines extend upto those where average rainfall is less than 30”. It is not merely low annual rainfall, but the frequency of deficiency of the annual rainfall from the average annual rainfall that determines famine of scarcity areas .......The famine areas in Rayalaseema in Andhra Pradesh are subject to more severe conditions due to greater frequency of successive deficiencies as compared to the corresponding areas in similar states ........ The analysis of rainfall for 57 years (1875 to 1931) shows that drought has occurred in 12 years due to failure of southwest monsoons and 27 times due to failure of northeast monsoons. Also drought in consecutive years has occurred mostly in northeast monsoons period, in 1875-76, 1896, 1900, 1907, 1908, 1909 and 1923-24.......... Rayalaseema, by its high frequency of deficiency from average annual rainfall, established itself as worst hit scarcity area in the peninsular India......... It is the amelioration of these scarcity areas that is going to be promoted by the allocation of maximum quantity of Godavari and Krishna waters to Andhra Pradesh.”

(సాంవత్సరిక సగటు వర్షపాతం 30 అంగుళాలకు తక్కువగా వున్న ప్రాంతాలు తరచు కరువుకాటకాలకు గురికాబడతాయి. సాంవత్సరిక సగటు వర్షపాతం తక్కువగా వుండటం వొక్కటేగాదు, సాంవత్సరిక సగటుకన్నా తక్కువ వర్షపాతం ఎంత తరచుగా సంభవిస్తున్నది అన్న అంశం ఆ ప్రాంతాల కరువుకాటకాల పరిస్థితిని నిర్ణయిస్తుంది. ఇతర రాష్ట్రాలలోని ఇటువంటి ప్రాంతాలకు పోల్చినప్పుడు ఆంధ్రప్రదేశ్‌లోని రాయలసీమప్రాంతం అతి తరచుగా, అతి పెద్దవైన కరువుకాటకాలకు గురౌతూంది. 1875 నుండి 1931 వరకు 57 సంవత్సరాల పరిశీలన తెలిపేదే మంటే, నైరుతీ ఋతుపవ

నాల వైఫల్యం మూలంగా 12 సంవత్సరాలూ, ఈశాన్య రుతుపవనాల మూలంగా 24 సార్లు కరువులు సంభవించాయి. 1875-76, 1896, 1900, 1907, 1908,1909, 1923-24 సంవత్సరాల్లో వరుసగా సంభవించిన కరువులన్నీ దాదాపు ఈశాన్య రుతుపవనాల వైఫల్యం వల్లనే. సాంవత్సరిక సగటు వర్షపాతం చాలా తక్కువగా వుండటం మూలాన దక్షిణ భారతదేశం మొత్తంలో తీవ్రంగా కరువుకాటకాలకు గురయ్యే ప్రాంతంగా రాయలసీమ ధృవపడింది. ఆంధ్రప్రదేశ్‌కు కృష్ణా-గోదావరి నదీజలాల్లో అధిక వాటా ఇవ్వడం మూలంగా ఈ కరువుప్రాంతాల క్షామ నివారణకు దోహదం కలుగుతుంది.) - ఈ వాక్యాలు కృష్ణా-గోదావరి నదీజలాల ట్రిబునల్ ఎదుట మన రాష్ట్రం చేసిన వాదనలో నుండి స్వీకరింపబడిన మచ్చుతునకలు. రాష్ట్రంలోని వివిధ జిల్లాలలో వర్షపాతం రికార్డు ఇలావుంది.

కోస్తాజిల్లాలు, ఉత్తర తెలంగాణా -------- 40% నుండి 50% వరకు
మధ్యతెలంగాణా, నెల్లూరు, చిత్తూరు ---- 30% నుండి 40% వరకు
కడప, కర్నూల్, అ.పురం, మహ.నగర్ -- 20% నుండి 30% వరకు

రాష్ట్రంలో అతి తక్కువ వర్షపాతం కలిగిన ప్రాంతంగానే గాక అతి తక్కువ భూగర్భజలాలు కలిగినదిగా గూడా రాయలసీమ ప్రఖ్యాతిగాంచింది. కోస్తాజిల్లాల్లో చేతాడు లోతున నీరు దొరుకుతూంటే, రాయలసీమలోని అనేక ప్రాంతాల్లో 250 అడుగుల లోతున గూడా నీరు దొరకడం దుర్లభం. దొరికిన చోట రెండు సంవత్సరాలకు పైబడి ఆ ఊట నిలవడం అసాధ్యం. ఇక్కడి పరిస్థితి ఇంత దారుణంగా వుంటే, ప్రభుత్వం, మేసినవాడికే మెక్కబెట్టే పద్ధతిలో నీటిపారుదల సౌకర్యాలన్నీ కోస్తాజిల్లాలకే కల్పిస్తూ వస్తూంది. రాష్ట్రప్రభుత్వ పక్షపాత వైఖరికి తార్కాణమైన ఈ క్రింది వివరాలను పరిశీలించండి -

(లక్షల హెక్టార్లలో)-

| జిల్లా | సాగులోవున్న భూమి | నీటిపారుదల కలిగిన భూమి | శాతం | ఇరుగారుసాగు శాతం |
|---|---|---|---|---|
| 1.శ్రీకాకుళం | 4.87 | 3.5 | 72.1 | 52.8 |
| 2.విశాఖపట్నం | 4.13 | 2.06 | 49.9 | 23.7 |
| 3.తూ.గోదావరి | 4.09 | 2.78 | 68 | 62.2 |
| 4.ప.గోదావరి | 4.22 | 3.5 | 82.7 | 70.6 |
| 5. క్రిష్ణ | 5.07 | 4.91 | 97 | 47 |
| 6.గుంటూరు | 5.97 | 4.65 | 77 | 43.3 |
| 7.ప్రకాశం | 6.33 | 4.7 | 49 | 17.6 |
| 8.నెల్లూరు | 3.46 | 2.27 | 65.6 | 57.6 |
| 9.కర్నూలు | 9.47 | 1.95 | 20.6 | 10.1 |
| 10.కడప | 4.11 | 1.68 | 40.9 | 17.1 |
| 11.అనంతపురం | 9.07 | 1.29 | 14.2 | 7.1 |
| 12.చిత్తూరు | 5.01 | 1.57 | 31.3 | 28.1 |

కోస్తాజిల్లాల్లో అతి తక్కువ నీటిపారుదల సౌకర్యం కలిగిన ప్రకాశంజిల్లా కంటే రాయలసీమలో అతి ఎక్కువ నీటిపారుదల సౌకర్యం కలిగిన కడపజిల్లాగూడా వెనుకబడివుంది. రాయలసీమలో భాగంగా వుండి, ఇటీవల కోస్తాజిల్లా అయిన ప్రకాశంలో కలిసిన కంభం, మార్కాపురం, గిద్దలూరు, ఎర్రగొండపాలెం తాలూకాలు ఏ ఆదరణకు నోచుకోనందువల్ల, ప్రకాశంజిల్లా అంకెల్లో అన్నిటికంటే కిందికి దిగిపోయిందే తప్ప, ఆ జిల్లాలోని కోస్తాప్రాంతం వల్ల కాదు.

ఈ అంకెల్లో పరిశీలించవలసిన మరో కిటుకుంది. పై అంకెల్లో బావులు, చెరువులు, ఊటకాలువలు మొదలైన వాటికింద సాగవుతున్న భూమిగూడా కలిసివుంది. ఈ రకమైన చిన్ననీటివనరులు రాయలసీమలో ఎక్కువ. ఉదా

హరణకు, చిత్తూరుజిల్లాలో భారీనీటిపారుదల పథకం లేకపోయినా, రాయల సీమజిల్లాలన్నిటి పైకి ఎక్కువగా ఇరుగారు తరిపైరు ఆ జిల్లాలో వున్నట్టు అంకెల్లో తెలుస్తూంది. కోస్తాజిల్లాల్లో సాగవుతున్న 38.14 లక్షల హెక్టార్లకుగాను 17 లక్షల హెక్టార్లకు (షుమారు 45%) భారీనీటి పారుదల ప్రాజెక్టుల ద్వారా నీరందుతూంటే, రాయలసీమలోని 27.66 లక్షల హెక్టార్ల సాగుభూమికిగాను 2.67 లక్షల హెక్టార్లకు మాత్రమే (షుమారు 10%) అందుతూంది.

గమనించవలసిన మరో అంశమేమంటే, ఆరుతడి సాగునూ ఇరుగారు తరినీ వొకే యూనిట్‌గా పై అంకెలు చూపుతున్నాయి. ఆరుతడి పైరుకు వర్షాకాలంలో ప్రాజెక్టులనుండి నీటి సరఫరా వుండదు. ఒక్క రబీ పంటకు మాత్రమే నీరిస్తారు. ఒక కారు తడిపైరులో సగం నీరైతే వొకకారు ఆరుతడికి సరిపోతుంది. ఇరుగారు తరికి ఖరీఫ్‌లోనూ రబీలోనూ ప్రాజెక్టులనుండి నీరు సరఫరా చేసితీరాలి. అంటే, రాయల సీమలోని ప్రాజెక్టుల కింద ఆరుతడి పైరుగా వున్న వొక హెక్టారు భూమికంటే, సర్కారులో ఇరుగారు తరిభూమికి ప్రతి హెక్టారుకు నాలుగంతలు నీరు సరఫరా చేయబడుతూంది.

కృష్ణా-గోదావరి నదీజలాల వివాదంలో ఇతర రాష్ట్రాలకంటే ఎక్కువ వాటా ఆంధ్రప్రదేశ్ ఎందుకు కోరిందో ఇదివరకే చెప్పబడింది. రాయలసీమ కరువు తీర్చటానికే నదీజలాల్లో వాటా అందరికంటే ఎక్కువగా కావాలన్నారు. మరి కృష్ణా-గోదావరి నదీజలాల్లో రాష్ట్రానికి వచ్చిన వాటాలో కనీసం సగం నీటిపైన రాయలసీమకు హక్కుందని ఈ వాదనే నిరూపిస్తుంది. చంకలో అవిటి బిడ్డ అడుక్కుతినేదానికి ఉపయోగపడిందేగాని, వాటాల పంపకంలో మాత్రం బిడ్డ నోట దుమ్ముబడింది.

కృష్ణా జలాలను వినియోగించటానికి భారతదేశంలో మొట్టమొదట రూపొందించబడిన ప్రణాళిక మెకంజీ పథకం. కృష్ణ-పెన్న నదుల ద్వారా కావలసివుండిన 36 లక్షల ఎకరాల సాగు రాజకీయరంగంలో వచ్చిన మార్పు వల్ల మరుగున పడినా, కృష్ణాజలాల మీద రాయలసీమ హక్కును ధృవపరిచింది.

ఆ తరువాత 1937లో జరిగిన శ్రీబాగ్ వొడంబడిక కృష్ణ, తుంగభద్ర, పెన్నా నదుల నీటిపై రాయలసీమకు సంపూర్ణమైన హక్కును కలిగించింది. 1951లో ప్లానింగ్ కమిషన్ అనుమతి పొందిన కృష్ణ-పెన్నార్ ప్రాజెక్టు ఈ

హక్కును బలపరిచింది.

మన రాష్ట్రంలో ప్రవహించే జీవనదులు రెండే వున్నాయి - అవి గోదావరి, కృష్ణ (తుంగభద్రానది కృష్ణకు ఉపనది మాత్రమే). గోదావరి నీరు తెలంగాణా, కోస్తా జిల్లాలకు ఉపయోగించవచ్చునే గాని, రాయలసీమకు తీసుకొచ్చే అవకాశమే లేదు. రాయలసీమకున్న ఏకైక ఆధారం కృష్ణాజలాలే కాబట్టి, కృష్ణాజలాల్లో అధికభాగం రాయలసీమజిల్లాలు పొందితీరాలి.

కృష్ణనీటిలో మన రాష్ట్రానికి వచ్చిన వాటా 800 టి.ఎం.సి. గోదావరి నీటిలో ఉపయోగించుకోగలిగిన 1200 టి.ఎం.సి. లు కలిసి, మొత్తం 2000 టి.ఎం.సి.లలో రాష్ట్ర జనాభానిష్పత్తి ప్రకారం రాయలసీమకు 400 టి.ఎం.సి.లు వాటాగా వస్తాయి. వర్షపాతం తక్కువగా వున్న ప్రాంతానికి అదనపు వాటా 5%గా తీసుకుంటే, మొత్తం 500 టి.ఎం.సి నీటిని రాయలసీమకే వినియో గించవలసివుంది. కానీ, రాయలసీమ క్షామాన్ని చూపి సంపాదించిన వాటాలో ఎంతవరకు రాయలసీమకు వినియోగించారు?

బచావత్ అవార్డు ద్వారా ఆయా రాష్ట్రాలకు కేటాయింపు ఈ విధంగా వుంది-

| | | |
|---|---|---|
| మహరాష్ట్ర | ----- | 565 టి.ఎం.సి. |
| కర్ణాటక | ----- | 695 టి.ఎం.సి. |
| ఆంధ్రప్రదేశ్ | ----- | 800 టి.ఎం.సి. |
| మొత్తం | -- | 2060 టి.ఎం.సి. |

మిగతా రెండు రాష్ట్రాలకన్నా మన రాష్ట్రానికే ఎక్కువ వాటా కృష్ణనీటిలో లభించింది. ఈ నీరేగాక, 'రీజెనరేషన్' ద్వారా వచ్చే 11 టి.ఎం.సి.లూ, ఎగువన విని యోగించుకోలేకపోయిన నీరు, వరద నీరు మొత్తం మన రాష్ట్రం వినియోగించుకోవచ్చునని బచావత్ ట్రిబునల్ తీర్మానించింది. అంతేగాదు, రాష్ట్రానికి వాటాగా ఇచ్చిన నీటిని, అమలులో ఉన్నట్టుగానీ లేక పథకం సిద్ధంగా వున్నట్టుగానీ ట్రిబునల్ ఎదుట నివేదించిన ప్రకారమే వినియోగించే అవసరం లేదనీ, తన ఏలుబడిలోని ఏ ప్రాంతానికైనా తన అనుకూలతను బట్టి సరఫరా చేసుకోవచ్చుననీ రాష్ట్రప్రభుత్వానికి కమిషన్ సంపూర్ణ స్వాతంత్ర్యం ఇచ్చింది.

బచావత్ అవార్డు వల్ల లభించిన స్వాతంత్ర్యంతో, అదే అవార్డువల్ల వచ్చిన నీటివాటాను ఏఏ ప్రాంతాల్లో ఎలా వినియోగించాలో నిర్ణయించడం కోసం 1981లో రాష్ట్రప్రభుత్వం వొక అఖిలపక్ష సమావేశాన్ని ఏర్పాటు చేసింది. ఈ సమావేశంలో అన్ని రాజకీయపార్టీలు కలిసి చేసిన వొప్పందం ప్రకారం ఆయా ప్రాంతాలకు పంపిణీ ఈ క్రింది విధంగా జరిగింది.

కోస్తా ---- 377.7 టి.ఎం.సి. ---- 49.2%

తెలంగాణా --- 266.83 ,, ---- 34.8%

రాయలసీమ -- 122.7 ,, ---- 16.0%

ఆవిరిద్వారా నష్టం 33.0 టి.ఎం.సి.

మొత్తం --- 800

(1981లో నీటిపారుదలశాఖ ప్రచురించిన కేటాయింపులనే అఖిలపక్ష వొప్పందంగా ప్రభుత్వం చిత్రీకరిస్తూంది.)

కుడినుండి ఎడమదాకా వున్న రాజకీయపార్టీలన్నీ కలిసి రాయలసీమకు చేసిన ద్రోహానికి ఇది తార్కాణం. రాయలసీమ కరువును గురించి ఎనలేని సానుభూతిని ప్రకటించే రాజకీయపార్టీల నాయకత్వం నరాల్లో దాగివున్న ప్రాంతీయతత్వానికి ఇది చెరగని శాసనం.

ఒక్క నీటి కేటాయింపుల్లోనే గాక, బడ్జెట్ కేటాయింపుల్లోగూడా రాయలసీమకు అన్యాయం జరుగుతూ వచ్చింది. పది సంవత్సరాలుగానీ, అవసరమైతే అంతకంటే ఎక్కువ కాలం గానీ రాయలసీమ నీటిపారుదల సౌకర్యాలకు అత్యధిక ప్రాధాన్యత ఇవ్వాలని శ్రీబాగ్ వొడంబడికలో పేర్కొన్నారు. కానీ, గత మూడు సంవ త్సరాల్లో పెద్దతరహా ప్రాజెక్టులకు కేటాయింపు ప్రాంతాల వారిగా ఇలావుంది --

కోట్ల రూపాయల్లో

| సంవత్సరం | మొత్తం కేటాయింపు | కోస్తా | తెలంగాణా | రాయలసీమ |
|---|---|---|---|---|
| 1980-81 | 111 | 63 | 45 | 3 |
| 81-82 | 117 | 68 | 45 | 4 |

| | | | | |
|---|---|---|---|---|
| 82-83 | 132 | 75 | 50 | 7 |

(1982-83లో కేటాయించిన 7 కోట్ల రూపాయలకుగాను శ్రీశైలం కుడికాలువకు వినియోగించవలసిన 3 కోట్ల రూపాయలు, ఆ పనిని మొదలు బెట్టక పోవడంవల్ల వాపసు పోయింది. వాస్తవంగా ఖర్చుచేసింది 3.85 కోట్లు మాత్రమే.)

రాయలసీమకు కేటాయించిన 122.7 టి.ఎం.సి.లలోగూడా కొత్తగా రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చినది దాదాపు శూన్యం. ఇందులో బ్రిటిష్ హయాములో త్రవ్విన కె.సి. కెనాల్ వాటా 40 టి.ఎం.సి.లు, ఆంధ్రరాష్ట్రానికంటే ముందే పుట్టిన తుంగభద్ర కాలువల ద్వారా వచ్చే 62 టి.ఎం.సి.లు ఇమిడివున్నాయి. నీటి కేటాయింపు వివరణ ఇలా వుంది --

| | | |
|---|---|---|
| 1. కర్నూల్ - కడప కెనాల్ --- | 39.9 | టి.ఎం.సి. |
| 2. తుంగభద్ర హైలెవల్ కెనాల్ --- | 32.5 | ,, |
| 3. తుంగభద్ర లోలెవల్ కెనాల్ --- | 29.5 | ,, |
| 4. భైరవానితిప్ప ప్రాజెక్టు --- | 4.9 | ,, |
| 5. గాజులదిన్నె ప్రాజెక్టు --- | 2.0 | ,, |
| 6. మైనర్ ఇరిగేషన్ --- | 13.9 | ,, |

ఈ కేటాయింపుల్లో గూడా మైనర్ ఇరిగేషన్‌కు కేటాయించిన 13.9 టి.ఎం.సి. లు దాదాపు ఉపయోగించనట్టే చెప్పాలి. వాస్తవంలో రాయలసీమకు అందుతున్న నీరు కేపలం 110 టి.ఎం.సి.లు మాత్రమే.

గోరు చుట్టపై రోకటిపోటులా శ్రీశైలం కుడి బ్రాంచి కాలువ పేరుతో వొక పథకానికి 1981లో ప్లానింగ్ కమిషన్ నుండి ఆమోదం పొందింది రాష్ట్రప్రభుత్వం. ఈ కాలువ ద్వారా రాయలసీమకు 19 టి.ఎం.సి.ల కృష్ణనీటిని ఇస్తున్నట్టు ప్రకటించింది. ఈ మోసపూరితమైన ప్రకటనలోని ఆంతర్యం రాయలసీమ ప్రజలకు ఇటీవలగాని తెలియలేదు. ఈ కాలువకు ఇస్తున్న 19 టి.ఎం.సి.ల నీరు రాయల సీమకు అదనంగా ఇస్తున్నది కాదు. కె.సి.కెనాల్ నీటిలో 8 టి.ఎం.సి. లు కోతకోసి, ఈ కాలువకు మళ్లిస్తున్నారు. మిగిలిన 11 టి.ఎం.సి.లకు గాను, మైనర్ ఇరిగేషన్ ప్రాజెక్టులు చేపట్టకుండా పొదుపైన

నీరు ఉండనేవుంది. కె.సి.కెనాల్‌కు ఇప్పుడిస్తున్న నీరు చాలదని బచావత్ కమిషన్ ఎదుట వాదించిన రాష్ట్రప్రభుత్వం, ఆ నీటిలోనే కోతగోసి మరో దారిలో కొత్తప్రాజెక్టుగా చూపడమంటే, ఇది రాయలసీమ కన్నీరు తుడవడానికి చేసిన తంతుగాదా?

కొత్తగా ప్రారంభించిన తెలుగుగంగ రాయలసీమకు వరప్రసాదమని వర్ణిస్తున్నారు. ఇంతకంటే దారుణం మరొకటుండదు. దీనివల్ల కర్నూలు, కడప, చిత్తూరు జిల్లాలు మూటికి కలిపి 3.25 లక్షల ఎకరాలు సాగవుతుంది. అదిగూడా కేవలం ఆరు తడి పైరు. రాయలసీమ నాలుగు జిల్లాలకు గాను సాగులోవుండి నీటిపారుదల లేని భూమి 51 లక్షల ఎకరాలు. ఈ మొత్తంలో తెలుగుగంగ వల్ల సాగయ్యే భూమి 3.25 లక్షల ఎకరాలే! అనగా మిగిలిపోయేది 47.75 లక్షల ఎకరాలు.

తెలుగుగంగ వల్ల వొక్క నెల్లూరుజిల్లాలో ఇప్పుడు సోమశిల ప్రాజెక్టు క్రింద వున్న 4.04 లక్షల ఎకరాల సాగు స్థిరీకరించబడటమే గాక, మరో 2 లక్షల 75 వేల ఎకరాలు సాగులోకి వస్తుంది. నెల్లూరుజిల్లాలోని మొత్తం 8 లక్షల 55 వేల ఎకరాలకు గాను, 5 లక్షల 61 వేల ఎకరాలకు నీటిసౌకర్యం ఇదివరకే ఏర్పాటు చేయబడింది. మిగిలిన 2.94 లక్షల ఎకరాలకుగాను తెలుగుగంగ ద్వారా 2.75 లక్షల ఎకరాలకు సౌకర్యం కలుగుతుంది. తెలుగుగంగ పూర్తయిన తరువాత నెల్లూరుజిల్లాలో 98% సాగులోకి వస్తుంది. ఈ మొత్తం తడిపైరు కావడం మరో విశేషం.

నెల్లూరుజిల్లా కోసం కృష్ణాజలాలలో వొక్క చుక్కైనా వాడటం లేదనీ, పెన్నానదీ కండలేర్ల వరదనీటిని మాత్రమే ఇందుకు వాడుతున్నామనీ ప్రభుత్వం తరఫున వెలువడుతున్న ప్రకటనలు రాయలసీమ ప్రజలకు మరింత బాధ కలిగిస్తున్నాయి. కృష్ణ నీటిని నెల్లూరు ప్రజలు వాడుకోకుండా చేయాలనే దుర్బుద్ధి రాయలసీమ వాసులకు లేదు. సంకుచిత బుద్ధిగలవారికి రాయల సీమ ప్రజల విశాలదృక్పథం అర్థంకాదన్నది ఇప్పుడుగూడా నిరూపిస్తున్నారు. 1200 టి.ఎం.సి. కృష్ణనీరు సముద్రంలో వృధాగా పోతున్నప్పుడు, అందులో 30 టి.ఎం.సి.ని నెల్లూరు సోదరులు వాడుకుంటే నేరమౌతుందా? కానేరదు. కానీ, రాయలసీమ ప్రజల కన్నుగప్పి కృష్ణనీటిని దొంగ చాటుగా తరలించవద్దని

మాత్రమే హెచ్చరిక చేయబడింది. నెల్లూరుజిల్లాలోని కండలేరు వొక చిన్న వాగు. తూర్పు కనుమల్లో పుట్టి, సుమారు 60 కి.మీ. నడిచి బంగాళాఖాతంలో కలుస్తుంది. అదే కనుమల్లో పుట్టి కడపవద్ద పెన్నానదిలో కలిసే బుగ్గలేరుతో సమానమైంది. దీనికి సుమారు 3 లక్షల ఎకరాలు సాగులోకి తెచ్చే సామర్థ్యమేవుంటే, అలాటి వాగులు రాయలసీమనిండా కొల్లలుగా వున్నాయి. కాదుగాబట్టి, ఏ జిల్లాగాని కృష్ణనీటిని ఆశించడం అవసరమౌతుంది. కండలేరును చూపించి మాయపుచ్చడం రాయలసీమ ప్రజలకు చేసే మోసమౌతుంది గాని వాస్తవం కాదు.

ఇక పెన్నానది వరదనీరంటారా - పెన్నాలోనే అంత నీరుంటే 1983 జనవరిలో మైలవరం జలాశయంనుండి నెల్లూరుకు అక్రమంగా నీరు తరలించవలసిన అవసరం ప్రభుత్వానికి ఎందుకు కలిగింది? పెన్నానది అనంతపురం, కడప జిల్లాల మీదుగా నెల్లురు చేరుతూండగా, అందులో వొక్క నెల్లూరుజిల్లాకేనా హక్కుండేది? మెకంజీ పథకంలో సుమారు 75 టి.ఎం.సి.ని నిలువజేయగల రిజర్వాయరు కడపజిల్లాలోని గండికోటవద్ద నిర్మించే అవకాశం వుందని కనబరిచి వుండగా, పెన్నాలో తగినంత నీరులేదనే సాకుతో ఆ ప్రాజెక్టును తుంగల్లో తొక్కారు. తుంగభద్ర హైలెవెల్ ఛానల్ స్టేజ్ 2 కింద అదే ప్రాజెక్టును కుదించి మైలవరం ప్రాజెక్టు పేరుతో 10 టి.ఎం.సి.ల రిజర్వాయరును నిర్మించి కడపజిల్లా భవిష్యత్తును నాశనం చేశారు. పెన్నకు ప్రధాన ఉపనదిగావున్న కుందూనదిపై అలగనూరు రిజర్వాయరు నిర్మించే అవకాశముండగా నెల్లూరుకు నీరు చాలవని దాన్ని అణగదొక్కారు. పాపాగ్ని నది మీద కమలాపురం, కదిరి తాలూకాల్లో రెండు రిజర్వాయర్లను నిర్మించే అవకాశాన్ని వెలుగులోకి రాకుండా రూపుమాపారు. ప్రభుత్వంలో తమకున్న పలుకుబడినీ, రాయలసీమ నాయకుల అంబేదతనాన్నీ ఉపయోగించి, నెల్లూరుజిల్లా రక్షణ కోసం పెన్నానది మీదగాని, దాని ఉప నదులమీద గాని 1 టి.ఎం.సి. కి మించి నిలువజేసే ప్రాజెక్టులేవీ నిర్మించరాదని ఆంక్షలు విధింపజేశారు. ఇది దుర్మార్గం కాదా?

సోమశిల ప్రాజెక్టు రిపోర్టులో 75% ఆధారంగా లభ్యమయ్యే నీరు 40.42 టి.ఎం.సి.గా అంగీకరించారు. ఈ నీరు 2 లక్షల ఎకరాల తరికి

సరిపోతుంది. కాగా సోమశిల ఆయకట్టు 4 లక్షలా 4 వేల ఎకరాలు! ఎలా సాధ్యమని అడిగితే పెన్నా వరదనీరన్నారు. ఇదిగాక ఇప్పుడు తెలుగుగంగ కింద మరో 3 లక్షల ఎకరాలు! నీరెక్క డిదంటే, పెన్నా వరదనీరంటున్నారు! పెన్నాలో ఇంత పెద్దఎత్తున వరద నీరుంటే, అందులో కొంతభాగం అనంతపురం, కడప జిల్లాలు వినియోగించుకో గూడదా? అంతా నెల్లూరు సొత్తేనా? మొదట సుమారు 35 టి.ఎం.సి.లకు రూపొందించిన సోమశిల, తరువాత 50 టి.ఎం.సి.ల స్థాయికి, ఆ తరువాత 75 టి.ఎం.సి.ల స్థాయికి ఎదిగిపోయింది. దీన్ని మరింత పెంచాలని కొందరు కాకారాయుళ్ళు మంత్రులకు మెహర్బానీ సలహాలు ఇస్తున్నారు. ఇంతింతై వటుడింతింతై పెరిగినట్టు సోమశిల పెరుగుతూండగా, రాయలసీమజిల్లాలు పాతాళానికి తొక్కబడుతున్నాయి.

రాష్ట్రంలో ఏ ఇతరప్రాంతానికీ నీటి కొరత రాకుండా రాయలసీమను సుభిక్షం చేసే అవకాశాలున్నా, రాష్ట్రప్రభుత్వం ఆ పథకాల పట్ల ఆసక్తి కనబరచకపోగా, ఏదోవొక సాకుతో వాటిని అణిచిపెడుతూంది. కృష్ణాబ్యారేజి నుండి సాలీనా 1200 టి.ఎం.సి.ల నీరు వృథాగా సముద్రంలో కలిసిపోతూందని అంటూనే, మరోవైపు రాయలసీమకు ఇవ్వటానికి నీరులేదంటుంది. నిలదీసి అడిగితే, నేరం కేంద్ర ప్లానింగ్ కమిషన్ మీదికి నెట్టుతుంది.

కేంద్ర ప్లానింగ్ కమిషన్‌తో అనుమతి పొందడం ఎలాగో రాష్ట్రప్రభుత్వానికి బాగా తెలుసు. కానీ, ఇరిగేషన్‌శాఖ మొత్తం రాయలసీమ పట్ల శత్రువైఖరి గల అధికారులతో నిండివుండటంవల్ల కాగితాలను మొక్కుబడిగా కేంద్రానికి పంపడం, అవి తిరస్కరించబడి తిరిగిరావడం జరుగుతూంది.

కేంద్రానికి పథకం పంపేటప్పటికి ఖచ్చితమైన నీటి ఆధారాన్ని రాష్ట్ర ప్రభుత్వం చూపగలగాలి. వరదనీటిపై ఆధారపడి ప్రాజెక్టులు నిర్మించడం ఆమోదించరు. కాబట్టి, రాయలసీమకు ఏ పథకాలు చేపట్టినా, వాటికి ఆధారం మనకు వాటాగా లభించిన 811 టి.ఎం.సి. కృష్ణనీటి నుండే చూపాలి. ఇలా చూపెట్టడంవల్ల కోస్తా జిల్లాలకు నష్టం వుండదు. కోస్తాజిల్లాలు వాడుకుంటున్న నీరుగాక 1200 టి.ఎం.సి. లు కృష్ణానదిలో అదనంగా వున్నాయి గాబట్టి, ఎగువ ప్రాంతాలలో 1000 టి.ఎం.సి. వాడినా ఇంకా 200 టి.ఎం.సి. కోస్తాజిల్లాలకు అదనంగా వుంటుంది. ఇప్పుడున్న ప్రాజెక్టులకు వరదనీరు

వాడుకుంటున్నట్టో, పంటమార్పిడి చేసినట్టో కనబరిచి, కొత్త ప్రాజెక్టులకు 811 టి.ఎం.సి.లనుండి కేటాయిస్తే ప్లానింగ్ కమిషన్ నిరభ్యంతరంగా ఆమోదిస్తుంది. దీనివల్ల కొత్త ప్రాజెక్టులు రావటమేగాక, ఉన్న ప్రాజెక్టుల ఆయకట్టు దెబ్బతినకుండా వుంటుంది. ఇవిగాక, కృష్ణాడెల్టాకూ, నాగార్జునసాగర్ ఎడమకాలువ కిందున్న సాగులో కొంతభాగానికీ గోదావరి నీటిని ఉపయోగించుకోవచ్చు. సుమారు 300 టి.ఎం.సి.ని గోదావరినుండి కృష్ణాడెల్టాకు తరలించే అవకాశం వుంది. కాబట్టి, కోస్తాజిల్లాలకు ఏ పరిస్థితుల్లోనూ నష్టం కలిగించకుండా రాయలసీమకు మేలుచేయవచ్చు.

కొత్త పథకాల పేరుతో ఇప్పుడు ఇస్తున్న నీరుగాక, మరో 290 టి.ఎం.సి. కృష్ణ నీరు రాయలసీమకు అవసరం. ఈ నీటిని ఈ కింద కనబరచిన ప్రాజెక్టుల ద్వారా వినియోగించవచ్చు -

టి.ఎం.సి.ల్లో

| ప్రాజెక్టు | ఇప్పటి కేటాయింపు | అదనంగా అవసరమయ్యే నీరు | మొత్తం |
|---|---|---|---|
| 1. తెలుగుగంగ | 27.5 | 70 | 97.5 |
| 2. శ్రీశైలం కుడికాలువ | 19.0 | 61 | 80.0 |
| 3. కె.సి.కెనాల్ | 31.9 | 29 | 60.9 |
| 4. తుంగభద్ర ఎగువకాలువ | 32.5 | 50 | 82.5 |
| 5. తుంగభద్ర లిఫ్ట్ ఇరిగేషన్ | --- | 80 | 80.0 |
| మొత్తం | | | 290 |

శ్రీశైలం రిజర్వాయర్ నుండి ప్రారంభమయ్యే కుడిగట్టు కాలువ మిట్టకందాల డీప్‌కట్ దాటి బనకచెర్ల రెగులేటర్ చేరిన తరువాత, తూర్పు - పడమర కాలువలుగా చీలిపోతుంది. ఈ తూర్పుకాలువ పేరే 'తెలుగుగంగ.' ఇది వెలుగోడు రిజర్వాయరు చేరి, అక్కడినుండి తూర్పుకనుమ పొడవునా ప్రయాణం చేసి, మఠం రిజర్వాయరుకూ, అక్కడినుండి చెన్నముక్కపల్లె ఆఫ్‌టేక్ నుండి పెన్నానదికీ చేరుకుంటుంది. తిరిగి, నెల్లూరుజిల్లా సోమశిల

రిజర్వాయరునుండి కండలేరు రిజర్వాయరు మీదుగా తమిళనాడులో ప్రవేశిస్తుంది. వెలిగోడు రిజర్వాయరు నుండి కొంత నీటిని తూర్పుకొండల్లో డీప్‌కట్ ద్వారా గుండ్లకమ్మ బేసిన్‌కు తరలించవచ్చు. గుండ్లకమ్మ మీద తురుమెల్ల వద్ద వొక రిజర్వాయర్ నిర్మించవచ్చు. అప్పుడు, 97.5 టి.ఎం.సి.ల నీటితో, కర్నూలుజిల్లాలోని ఆత్మకూరు, నంద్యాల, ఆర్లగడ్డ తాలూకాలూ, కడపజిల్లాలోని ప్రొద్దుటూరు, బద్వేలి, సిద్దవటం తాలూకాలూ, చిత్తూరు జిల్లాలోని కాళహస్తి, సత్యవేడు, పుత్తూరు తాలూకాలతో పాటు, ప్రకాశం జిల్లాలోని గిద్దలూరు, కంభం, మార్కా పురం, ఎర్రగొండపాలెం, దర్సి, పొదిలి తాలూకాలను సస్యశ్యామలం చేయగలదు. ఈ నీటితో కేవలం ఆరుతడి పైరు గాక, ప్రతి జిల్లాలో 1/3 వంతు తరికి గూడా అవకాశముంటుంది.

బనకచెర్లనుండి ప్రారంభమయ్యే కుడిబ్రాంచి కాలువ, సర్ మెకంజీ గారి జ్ఞాపకార్థం 'మెకంజీ పథకం'గ నామకరణం చేసి, దానికిప్పుడు కేటాయించిన 11 టి.ఎం.సి.లకు (19-8 = 11) తోడు, 69 టి.ఎం.సి.లు అదనంగా కేటాయించవలసి వుంది. ఈ కాలువను ఇప్పటి ప్లానులో చూపిన ప్రకారం ఔకువద్ద నిలిపివేయకుండా, కృష్ణా- పెన్నార్ ప్రతిపాదనలోవలె, మైలవరం రిజర్వాయరు ద్వారా పాపాగ్ని నదిపైన తుమ్మలూరు రిజర్వాయరుకూ, దాన్నుండి బుగ్గవంక రిజర్వాయరుకు కలపడం ద్వారా, కర్నూలు జిల్లాలోని పాణ్యం, బనగానిపల్లె, కోవెలకుంట్ల, నొస్సం ప్రాంతాలకే గాక, కడపజిల్లాలోని జమ్మలమడుగు, ముద్దనూరు, కమలాపురం, కడప తాలూకాలకు నీరు అందుతుంది. ప్రస్తుతం తుంగభద్ర హైలెవెల్ కెనాల్ స్టేజ్ 2 కింద మైలవరం రిజర్వాయరుకు తుంగభద్రనుండి అందుతున్న 10 టి.ఎం.సి. నీటిని అనంతపురం జిల్లాలోనే వినియోగించి తుంగభద్ర హైలెవెల్ కాలువ ఆయకట్టును పెంచవచ్చు.

కె.సి.కెనాల్‌కు 1981 అగ్రిమెంటు ప్రకారం 39.9 టి.ఎం.సి.ల నీరు కేటాయించబడింది. ఇప్పుడు అందుతున్న నీరు చాలక ఎన్నిసార్లు పైర్లు ఎండిపోయాయో, ఆ ఆయకట్టుకు ఎన్నిసార్లు శిస్తు రెమిషన్ ఇవ్వవలసి వచ్చిందో ప్రభుత్వానికి తెలుసు. కనీసం 60 టి.ఎం.సి. నీరు దీనికి అవసరమని అనేక సందర్భాల్లో ప్రభుత్వం అంగీకరించింది. కె.సి.కెనాల్‌కు సుంకేసల

ఆనకట్టనుండి తుంగభద్ర నీరు సరఫరా అవుతూ వుంది. అలాగాక, బనక చెర్లనుండి కృష్ణనీటిని 60 టి.ఎం.సి. మేరకు ఈ కాలువకు సరఫరా చేస్తే, కె.సి.కెనాల్ ఆయకట్టు నిలవడమేగాక, తుంగభద్ర నీటిని మల్లేశ్వరం డ్యాం నుండి ఎగువకాలువ ద్వారా అనంతపురానికి ఉపయోగించవచ్చు. దీనికి తోడు, మద్రాసు నీటి సరఫరా నిమిత్తం కర్ణాటక, మహరాష్ట్రలనుండి రావలసిన 10(5+5) టి.ఎం.సి.లను గూడా తుంగభద్ర ఎగువకాలువకే కేటాయిస్తే, ఆ కాలువలో ఇప్పుడు పారుతున్న 32.5 టి.ఎం.సి.కి తోడు మరో 60 టి.ఎం.సి.(కె.సి.కెనాల్ 40 + మైలవరం 10 + కర్ణాటక, మహరాష్ట్ర 10) ఇందులో లభిస్తాయి. తుంగభద్ర ఎగువకాలువకు సమాంతర కాలువ (parellal canal) ద్వారా ఈ నీటిని ఆ జిల్లా మిట్టప్రాంతాలకుగూడా వినియోగించవచ్చు. అంతేగాక, మలగవెల్లి రిడ్జ్ కటింగ్ ద్వారా, గుంతకల్లు బ్రాంచికెనాల్‌ను కర్నూలుజిల్లాకు పొడిగించి ఆలూరు, పత్తికొండ, ఆదోని, డోన్ తాలూకాలకు నీటిని సరఫరా చేయవచ్చు.

మల్లేశ్వరం డ్యాం మనరాష్ట్రానికీ, కర్ణాటక రాష్ట్రానికీ ఉమ్మడి ప్రాజెక్టు కావడంవల్ల, ఆ ప్రాజెక్టునుండి ఉత్పత్తి అయ్యే విద్యుత్తులో 80శాతం, నీటిని 20శాతం మన వాటాగా పొందుతున్నాం. కర్ణాటక ప్రభుత్వం ఎదుర్కొంటున్న కరెంటు కొరతను దృష్టిలో వుంచుకుని, ఇచ్చిపుచ్చుకునే ప్రాతిపదికపై సంప్రదింపులు జరిపితే, కొంత నీటిని మనం అదనంగా పొందే అవకాశం వుంది. అదీగాక, మల్లేశ్వరం వద్ద అదనంగా లభిస్తున్న నీటి వినియోగానికిగూడా ఆ ప్రభుత్వంతో అంగీకారానికి రావచ్చు. ఈ నీరు 80 టి.ఎం.సి.లకు తక్కువగా మాత్రం వుండదు. వీటిని లిఫ్ట్ ఇరిగేషన్ ద్వారా అనంతపురంజిల్లాలోని రాయదుర్గం, కళ్యాణదుర్గం, హిందూపురం, మడకసిర, పెను గొండ, కదిరి తాలూకాలకూ, చిత్తూరుజిల్లాలోని వాయల్పాడు, పీలేరు, చంద్రగిరి, మద నపల్లె తాలూకాలకూ, కడపజిల్లాలోని రాయచోటి, లక్కిరెడ్డిపల్లె తాలూకాలకూ సరఫరా చేయవచ్చు. ఈ మిట్టప్రాంతాల్లో వీలైనన్ని కొత్త పర్కొలేషన్ ట్యాంకులు నిర్మించి, ఈ నీటిని నింపొచ్చు. అంతేగాక, ఆయకట్టు చెరువుల సిల్ లెవెల్ పెంచడం ద్వారానూ, కట్టలను బలం చేయడం ద్వారానూ ఉన్న ఆయకట్టు దెబ్బతినకుండా కొంత డెడ్ స్టోరేజ్ వుండేలా చేస్తే

పర్కొలేషన్‌కు ఉపయోగపడుతుంది.

కాబట్టి, ఆంధ్రప్రదేశ్ నీటిపారుదల శాఖవారు ఇప్పటికైనా రాయలసీమ వ్యతి రేక ధోరణి విడనాడి, తక్షణం పై ప్రణాళికలను చేపట్టవలసిన అవసరం వుంది. అలా చేయని పక్షంలో ప్రభుత్వాన్ని అంకుశంతో అదుపులోకి తీసుకోవలసిన అవసరంగూడా రాయలసీమ ప్రజలకు వుంటుంది. ఎందుకంటే, ఇది రాయలసీమ ప్రజలముందున్న ఆఖరు అవకాశం.

ఎందువల్ల ఇది ఆఖరు అవకాశం? తుంగభద్ర నుండి అనంతపురం, చిత్తూరు జిల్లాలలోని మిట్టప్రాంతాలకు అవసరమైన నీటిలో కొంతభాగమైనా అందించాలంటే, ప్రస్తుతం తుంగభద్రనుండి కె.సి.కెనాల్‌కూ, మైలవరం రిజర్వాయరుకూ సరఫరా అవుతున్న నీటిని మళ్లించడం తప్ప మార్గంలేదు. ఆ పని జరగాలంటే, శ్రీశైలం రిజర్వాయరునుండి ఆ రెంటికి ప్రత్యామ్నాయ సరఫరా ఏర్పాటు చెయ్యాలి. కానీ, శ్రీశైలం కుడికాలువకు కావలసిన 11 టి.ఎం.సి.లు, తెలుగుగంగకు కావలసిన 42.5 టి.ఎం.సి.లు (మొత్తం 53.5 టి.ఎం.సి.) నీటిని మళ్లించటానికి సరిపడేమాత్రమే మిట్టకందాల డీప్‌కట్‌ను, బనకచెర్ల రెగులేటరును రూపొందించారు. వీటి నిర్మాణం పూర్తైన తరు వాత వెడల్పు చేయడం అసాధ్యమైన పని. ఇవి నిర్మాణమైతే రాయలసీమ నీటి అవసరాలకు శాశ్వతమైన సమాధి నిర్మించబడినట్టవుతుంది. నీరు వున్నదా లేదా అనే మీమాంస పక్కకు నెట్టి, భవిష్యత్తును దృష్టిలో వుంచుకుని ఈ నిర్మాణాల ప్రమాణాన్ని కనీసం 150 టి.ఎం.సి.లు విడుదలచేసే విధంగా మార్చకపోతే రాయలసీమవారు నీటిని అడిగేదీ వుండదు, ప్రభుత్వం ఇవ్వ టమూ వుండదు. ఎన్ని తెలుగుగంగలైనా, మరెన్ని సేతు గంగలైనా రాయల సీమకు సానుభూతిని అందించగలవేగాని నీటిని మాత్రం కాదు.

# అనుబంధం 1

గౌరవనీయులైన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగారికి -

ఆర్యా!

తెలుగుగంగ ప్రాజెక్టుపై మా అభిప్రాయాలను పత్రికలకు విడుదల చేయడం వల్ల మీరు నొచ్చుకున్నారని తెలిసింది. అనాలోచితంగా మీ మనసును గాయపరిచినందుకు క్షమించవలసినదిగా కోరుతున్నాను. మీపట్ల అవిశ్వాసం గానీ, రాయలసీమ ప్రజలకు మీరు ద్రోహం చేస్తారన్న తలంపుగాని మాకు ఏ కోశానా లేదు. చారిత్రికమైన అనేక అంశాలను మీ దృష్టికి రాకుండా మరుగుపరిచారనేదే మా ఆవేదన. పత్రికలవారికి గూడా ఈ విషయం స్పష్టం చేశాం. కానీ, వారు ఈ భాగాన్ని తప్పించడంవల్ల మా ప్రవర్తనపట్ల మీరు చిన్నబుచ్చుకునే అవకాశం కలిగించారు.

మేము తొందర పడటానికిగాని, ఆవేశపడటానికిగాని కారణం అనాదిగా మా కరువుసీమకు జరుగుతున్న అన్యాయం. ఒకనాటి రాయల పరిపాలనలో రతనాల సీమగా ఈ ప్రాంతం ఎందుకు చెప్పబడింది? అలనాటి సాంకేతిక పరిజ్ఞానం అవకాశమిచ్చిన మేరకు ప్రతిచోటా రాయలు చెరువులను త్రవ్వించాడు. కేవలం నీటిపారుదల కోసమేగాక, భూగర్భ జలనిధులను కాపాడే చెరువులు (percolation tanks) గూడా వీటిలో వున్నాయి. జనాభా గూడా అప్పట్లో పరిమితంగా వున్నందువల్ల చెరువులు, బావులు, ఊటకాలువలు మొదలైనవాటి మూలంగా సాగుబడి అవుతూవచ్చిన భూమి, ఆనాటి అవసరాలను తీర్చి మిగులును కలిగించేది. అందువల్ల, ఈ సీమలో రైతులు తాము తిని, ఇతరులకింత పెట్టగలిగేవారు.

అప్పట్లో, ఆంధ్రప్రదేశ్‌లోని ఇతర ప్రాంతాలకు చెరువులు నిర్మించే సాంకేతిక పరిజ్ఞానం చేరనందువల్లనో, లేక నైసర్గికంగా రాయలసీమకున్న అనుకూలత లేకపోయినందువల్లనో, జీవనదులు ప్రవహిస్తున్నా వినియోగం పరిమితంగా వుండేది. వర్షాభావంవల్ల కరువుకాటకాలొస్తే ఇతర ప్రదేశాల ఆంధ్రులు రాయలసీమకు వలస వచ్చేవారని చెబుతారు.

కానీ, కాలక్రమంలో ఓడలు బండ్లయినాయి, బండ్లు ఓడలయినాయి.

క్రమేణ రాయలసీమపై వర్షం తగ్గుతూ వచ్చింది. జనాభా పెరిగిపోయింది. చెరువులు నిరుపయోగమయ్యాయి. భూగర్భజలాలు ఇంకిపోయాయి. మీరు ఈపాటికి గమనించే వుంటారు - గత సంవత్సరం 50 గజాల లోతున నీళ్ళుంటే, ఈ ఏడు 100 గజాల లోతుకు వెళ్ళవలసి వస్తూంది. కొన్ని తావుల్లో రిగ్గు గూడా నిరుపయోగమయ్యే పరిస్థితి ఏర్పడింది. తాత్కాలిక సహాయచర్యలకోసం ప్రతి ఏటా పెట్టే ఖర్చుకు శాశ్వత కరువు నివారణ పథకాలు కొద్దికొద్దిగా చేపట్టివున్నా రాయలసీమకు ఈనాడు ఈ దుర్గతి వుండేదికాదు.

రాయలతోపాటు రాయలసీమ వైభవంగూడా ముగిసింది. అంగళ్ళలో రతనాలు అమ్మిన చేతికి భిక్షాపాత్ర వచ్చింది. షుమారు 200 సంవత్సరాల నుండి ప్రతి ఏటా ఏదోవొక మూల కరువు; ఎన్నో గ్రామాలకు మంచినీటి కొరత. మంచినీటికోసం మైల్ల తరబడి వెళ్ళి బండ్లమీద నీరు మోసుకునే ప్రజలను చూసినప్పుడల్లా మాకు గూడా వొక ఉప్పెన వస్తే బావుండు ననిపిస్తుంది. చచ్చేవా రెంతమందైనా వొకసారే చస్తారు. ప్రతి ఏటా ఇంతింతగా చచ్చే ప్రసక్తి వుండదు. పోయినవారు పోగా మిగిలిన వారికైనా ఇంత మంచినీరు దొరుకుతుందనిపిస్తుంది. కోస్తా, తెలంగాణా సోదరులు ప్రభుత్వాలతో పోరాడు తూంటే, రాయలసీమ ప్రజలు ప్రకృతితో పోరాడుతున్నారు.

ఈ ప్రాంత ప్రజల దయనీయమైన పరిస్థితి గమనించిన సర్ మెకంజీ, సర్ ఆర్థర్ వంటివారు రాయలసీమకు నీటివసతికై పరిశోధనలు చేశారు. వారి పరిశోధనల్లోనూ, ఇటీవల శాస్త్రజ్ఞులు జరిపిన పరిశోధనల్లోనూ కరువుకంటే భయంకరమైన విషయాలు కొన్ని బయటపడ్డాయి. ఏదోవొకవిధంగా రాయల సీమను నీటితో తడపకపోతే రాబోయే వంద సంవత్సరాలకు ఈ ప్రాంతం ఊసరక్షేత్రంగా మారక తప్పదు. ఇలాంటి భయంకర పరిస్థితిలో వుండిగూడా రాయలసీమ ప్రజలు నాగార్జునసాగర్ కొరకు కృష్ణా-పెన్నార్ ప్రాజెక్టును త్యాగం చేశారు. కడగొట్టుగానైనా కృష్ణలో మిగిలిన నీటిని రాయలసీమకు అందివ్వటానికి ఎందుకు చేతులు రావటంలేదు? రాయలసీమను కరువుకాటకాలకు వదిలేసి, దొంగచాటుగా మరో చోటికి కృష్ణనీటిని తరలించుక పోవటానికి మేం చేసిన పాపమేమిటి?

మెకంజీ పథకం కింద అప్పట్లో రాయలసీమ భాగమైన బళ్ళారిజిల్లాలో 6 లక్షల ఎకరాలు, కర్నూలు, కడప, అనంతపురం జిల్లాలలో 22 లక్షల ఎకరాలు, నెల్లూరుజిల్లాలో 4 లక్షల ఎకరాలు సాగులోకి వచ్చుండేది. ఆంధ్ర దేశంనుండి విడిపోయిన పుణ్యానికో ఏమో బళ్ళారిజిల్లా తుంగభద్ర ప్రాజెక్టువల్ల సుభిక్షంగావుంది. నెల్లూరుజిల్లాకు కనిగిరి చెరువుకింద సాగవుతున్న 2.5 లక్షల ఎకరాలు గాక, సోమశిల ప్రాజెక్టువల్ల 4 లక్షల ఎకరాలు సాగులోకి వస్తుంది. రాయలసీమజిల్లాలకు బ్రిటిష్‌వారు నిర్మించిన కర్నూల్-కడప కాలువగాక స్వాతంత్ర్యం తరువాత వచ్చిందేమిటి? తుంగభద్ర హైలెవెల్ కాలువ, మైలవరం, కళ్యాణి వంటి ఆధునిక చెరువులు! ఇవన్నీ కలిసి నాలుగుజిల్లాల మొత్తంలో 4 లక్షల ఎకరాలు మాత్రమే సాగులోకి తేగలిగాయి.

ఉమ్మడి మద్రాసురాష్ట్రం కృష్ణ-పెన్నార్ ప్రాజెక్టునుచేపట్టడానికి పూనుకుంది. ఈ పథకం కింద కడపజిల్లాలో 4 లక్షల ఎకరాలు, కర్నూలుజిల్లాలో 2.5 లక్షల ఎకరాలు సాగులోకి వచ్చివుండేది. చిత్తూరుజిల్లాకు ఇప్పుడు లభిస్తున్న మేరకు అప్పుడుగూడా దొరికేది. మద్రాసు నగరానికి మంచినీటి కొరతగూడా ఆనాడే తీరేది.

కానీ, అప్పటి వీరావేశం ఏమిటి? తెలుగుగంగ తమిళులకు చుక్కైనా అందరాదని! తెలుగు నీటిని తెలుగు ప్రజలే వాడుకునేట్టు చేయడానికై కృష్ణా-పెన్నార్ ప్రాజెక్టును త్యాగం చేయాలని రాయలసీమకు ఉద్బోధించారు. ప్రత్యామ్నాయంగా నాగార్జునసాగర్ రూపొందింది.

మరి ఈనాడు జరుగుతున్నదేమిటి? తెలుగుగంగ తమిళనాడు చేరుతుంది. కృష్ణగంగ నెల్లూరుసీమను సుభిక్షం చేయబోతూంది. నాగార్జునసాగర్ కోస్తా తెలంగాణల దారిద్ర్యం తీరుస్తూంది. రాయలసీమలో కరువు రాక్షసి ఇనపగజ్జెలతో తాండవిస్తూంది! కృష్ణ-పెన్నార్ ప్రాజెక్టు కింద సాగుకు రావలసిన ముద్దనూరు, కమలాపురం, కడప తాలూకాల నీరు నెల్లూరు, గూడూరు, సూళ్ళూరుపేట చేరుకుంటూంది. మాకు జరిగింది అన్యాయమో కాదో మీరే చెప్పండి. మాకు జరగబోతున్నది ద్రోహమో కాదో మీరే ఆలోచించండి. ఎండిన గొంతుతో చావబోయేముందైనా నీటికోసం వొక కేక వేయటం తప్పంటారా? ఇది క్రమశిక్షణారాహిత్యమంటారా? మీరు పరిశీలించిన మీదట

మేము తెలిపిన విషయాలు సత్యదూరాలైతే మీరే శిక్ష విధించినా సంతోషంగా అనుభవించటానికి సిద్ధంగా వున్నాము.

శ్రీశైలం ఎడమబ్రాంచి కాలువ కింద సాగుకోసం తెలుగుగంగ పథకానికి కేటాయించిన నీరు 27.5 టి.ఎం.సి. అంటున్నారు. సాగు కావలసిన భూమి 5.75 లక్షల ఎకరాలు అంటున్నారు. ఆ నీరు ఇన్ని ఎకరాలకు చాలదు. కాబట్టి, వెలుగోడు, బ్రహ్మంగారిమఠం రిజర్వాయర్ల నిలువలను గూడా ఇందుకు వినియోగించాలి. కర్నూలు-కడప కాలువ ఆయకట్టు స్థిరీకరణ కోసమూ, కర్నూలుజిల్లాలో లక్ష ఎకరాలు, కడప జిల్లాలో 50 వేల ఎకరాలు అదనపు ఆయకట్టు కోసమూ వెలుగోడు రిజర్వాయర్ కావాలని ఎంతోకాలంగా ఈ జిల్లాల ప్రజలు విజ్ఞప్తి చేస్తున్నారు. అది వదిలేసి, ఇప్పుడు వెలుగోడు రిజర్వాయరును కుడిబ్రాంచి కాలువతో ముడివేసి, రాయలసీమజిల్లాలకు కుడిబ్రాంచి కాలువ నీటితో సరిపెట్టి, వెలుగోడు, మఠం రిజర్వాయర్ల నీటిని నెల్లూరుకు తరలిస్తున్నారు. ఇది కంటికి తెలియకుండా కాటుకను దొంగిలించే చాతుర్యంగాక మరేమిటి?

వెలుగోడు రిజర్వాయరుకుగాని, మఠం రిజర్వాయరుకుగాని క్యాచ్ మెంట్ ఏరియా మొత్తం కర్నూలు, కడప జిల్లాలలో భాగమైన నల్లమల కొండలు. ఈ రిజర్వాయర్ల నీటికి మరో 12 టి.ఎం.సి. కృష్ణనీటిని ఎడమ కాలువ ద్వారా ఇస్తేచాలు, ఇప్పుడు తెలుగుగంగ పథకం కింద కర్నూలు కడప, చిత్తూరు జిల్లాలలో చూపించిన 3.25 లక్షల ఎకరాలు సాగౌతుంది. ఇప్పుడు కేటాయించిన 27.5 టి.ఎం.సి. నీటిలో మిగులుతున్న 15.5 టి.ఎం.సి. లను కుడికాలువకే ఇచ్చి, మైలవరంనుండి పాపాగ్ని రిజర్వాయరుకు, అక్కడి నుండి బుగ్గవంక రిజర్వాయరుకు నీటిని అందిస్తే, కడపజిల్లాలో మరో 2.5 లక్షల ఎకరాలు ఆయకట్టు కావడమేగాక, ఔకు రిజర్వాయరు ఆయకట్టు స్థిరీకరించబడి కోయలకుంట్ల తాలూకాకూ, తాడిపత్రి తాలూకాలో కొంత భాగానికీ ఉపయోగం కలుగుతుంది.

శ్రీశైలం రిజర్వాయరులో తగినంత నీరు లేదనడం కూడా సమ్మతించ తగిన వాదన కాదు. కృష్ణాడెల్టాకు అనుమతించిన నీరెంత? కృష్ణాడెల్టా రైతుల అలక్ష్యంవల్ల ఎంత నీరు వృధాగా సముద్రం పాలవుతూవుంది!

కోస్తా ప్రాంతంలో వరిదిగుబడి ఇది వరకటికంటే ఎందుకు తగ్గిపోతూందో మీకు తెలిసే వుంటుంది. నిరంతరం నీరుపెట్టడంవల్ల భూమిమీది తడి ఆరే అవకాశంలేక పైరుకు అగ్గితెగులు అంటుకుంటూంది. ఏటా కొన్ని కోట్ల రూపాయల మందులు వాడినా ప్రయోజనం అంతగా దొరకటంలేదు. ఒకవైపు ఆకలి, మరోవైపు అజీర్ణం! అజీర్ణం చేసే నీటినైనా కనీసం శ్రీశైలం వద్ద నిలపవచ్చు.

మన రాష్ట్రం నీటిసమస్య తీరటానికి పోలవరం ప్రాజెక్టు నిర్మాణం తప్పనిసరి. పోచంపాడు ప్రాజెక్టు కింద కలిసే ఉపనదులవల్ల, గోదావరి మహాసముద్రమవుతుంది. మనం వినియోగించుకోలేక పోతున్నందువల్ల ఈ నీటిలో చాలాభాగం సముద్రం పాలౌతూంది. పోలవరం ప్రాజెక్టు ద్వారా ఈ నీటిని కృష్ణా డెల్టాకు ఉపయోగిస్తే, కృష్ణా బారేజి వద్ద వాడకం తగ్గి, ఆ నీటిని శ్రీశైలం వద్ద వినియోగించే అవకాశం వుంది. ఈ నీరంతా ఇక్కడ లభించినప్పుడు రాయలసీమ, తెలంగాణాలకే గాక, నెల్లూరు జిల్లాకు గూడా ఇప్పటి ఆయకట్టుకు అవకాశం వుంటుంది. అంతేగాక, మిట్టప్రదేశమైన చిత్తూరుజిల్లాకు శ్రీ తిరునారాయణ్‌గారు ప్రతిపాదించిన విధంగా తుంగభద్ర రిజర్వాయరునుండి కొంత నీటిని అందించే అవకాశం కలుగుతుంది.

అందువల్ల, నీరు లేదు అన్న సంశయానికి తావులేదు. మనసుంటే మార్గముంది. ఈ ప్రణాళిక మొత్తాన్ని అమలుపరచటానికి కాలం పడుతుంది. ఆలస్యానికి ఓర్చలేని వారికోసం ఎంతో కాలంనుండి ఓర్పు చూపించిన రాయలసీమకు మాత్రం అన్యాయం జరుగనీయకండి.

హైదరాబాదు, | మీ సోదరుడు
28-4-1983. | ఎం.వి. రమణారెడ్డి,
ఎం.ఎల్.ఏ., ప్రొద్దుటూరు.

To
**The Hon’ble Chief Minister,**
Government of Andhra Pradesh,
HYDERABAD.
Hon’ble Sir,

We, the legislators of Rayalaseema wish to bring to your kind consideration the irrigation needs of our region.

At the outset, we congratulate the Government of Andhra Pradesh, the Chief Minister in particular and express our gratefulness for launching TELUGU GANGA Project, to serve the irrigation needs of a portion of Rayalaseema.

But, yet there is much more to be done for this chronic famine affected area. The history of Rayalaseema is nothing but the history of famines dating back to centuries. That the worst of famine of 1876 took a toll of 40% of the population on account of starvation is well known.

The then governments had to evolve a famine code to combat famine in Rayalaseema. The British Engineers, out of sheer compassion for the miseries of the people affected by famine examined various measures to protect the population and came to the conclusion that irrigating large tracts of area of Rayalaseema was the only solution. Several Brutish Engineers like Mackenze, Cotton and Fischer finally prepared plans to link up Tungabhadra basin with Pennar basin on one hand, and Krishna basin Pennar basin on the other with number of reservoirs at various reaches. Unfortunately, this comprehensive scheme remained unimplemented for a number of years.

Later, in 1940s, Madras Government began to implement a part of this scheme by taking up the construction of Mallapuram dam across Tungabhadra river, which differed materially from Mackenze’s scheme who suggested a larger reservoir for the exclusive benefit of Rayalaseema.

Again in 1950s, the Government of Madras prepared plans and estimates for a reservoir across River Krishna at Siddeswaram with canals, known as Krishna - Pennar East and West to irrigate large tracts of land in Kurnool and Cuddapah districts. But unfortunately, the Krishna - Pennar Project got shelved on account of the controversies developed between the Telugu speaking people and Madras Government. The sentimental approach to the problem deprived the people of Rayalaseema of the benefits of Krishna - Pennar Project and Andhra State opted for Nagarjunasagar in its place.

The earlier fears among the people of Rayalaseema that they may

get neglected by the dominant majority of Coastal Andhra after linguistic reorganisation of the States were allayed by the reiteration of the spirit of Sribagh Pact. Meanwhile new currents in politics created a different picture. By the formation of Visalandhra, the spirit of Sribagh Pact was totally lost.

In 1969, Rayalaseema people realised their backwardness in all the fields, recollected Sribagh Pact and started agitating for their rightful demands. But the fight was lost because of sabotage by leaders who made themselves comfortable positions in State Cabinet. The people of Rayalaseema were left once again with unfulfilled promises. That is how the region remains totally neglected leading to further accentuation of regional imbalances. Now we see a ray of hope with the advent of Telugu Desam Government which is committed to the development of famine stricken areas. As a first step in this direction, the Government proved its commitment by launching Telugu Ganga Project.

In this connection, we bring to the notice of the Government that large areas in the districts of Rayalaseema are yet to be covered with irrigation facilities and suggest a Master Plan be prepared to cover all these areas. We feel that by linking Godavari basin with that of Krishna and if necessary Krishna basin with that of Tungabhadra in the upper reaches and also making suitable changes in cropping pattern wherever it is possible so that adequate quantities of water can be made available for the requirements of Rayalaseema. We propose the following schemes for examination and early implementation in this regard.

**Proposal No.1:**

Srisailam right bank right branch canal should be extended upto Cuddapah by tagging it on to Mylavaram reservoir and by constructing a reservoir across Papagni river at Tummaluru to irrigate Panyam, Nandyal, Banaganipalle, Koilakuntla, Jammalamadegu, Muddanur, Kamalapuram and Cuddapah Taluks of Kurnool and Cuddapah Districts.

**Proposal No.2:**

The areas of Markapuram, Kambam, Giddalur should be served by transferring sufficient water from Velugodu reservoir to Gundlakamma and Sagileru basins through a tunnel and constructing a balancing reservoir at Turumella.

**Proposal No.3:**

The scope of Tungabhadra High Level canal, should be suitably widened to cover (A) Adoni, Pattikonda and Dhone Taluks in Kurnool district by cutting a ridge at Malagavelli, and Gooty and Guntakal taluks

by extending Guntakal Branch canal, (B) Dharmavaram and Anantapur taluks by Penna - Ahobilam right canal, and (C) Tadpatri taluk by Yadiki scheme on Penna river.

**Proposal No.4:**

To cater the needs of upland areas like Madakasira, Hindupur, Kadiri, Penugonda, Rayadurgam and Kalyanadurgam taluks in Anantapur district which are not commandable under Tungabhadra High Level Canal, Vayalpadu taluk in Chittore district and Rayachoti and Lakkireddypalle taluks in Cuddapah district, efforts should be initiated by starting a dialogue with Karnataka Government for a joint project at higher levels of Tungabhadra to flow either by gravity or by lift.

In conclusion, we request the Hon'ble Chief Minister to take a compassionate view to save the people of Rayalaseema from the ravages of recurrent famines and take up all these projects for speedy implementation.

Yours obediently,

Sd/- D.Narayanaswami, M.L.A., Anantapur.
Sd/- B.Veera Reddy, M.L.A., Badvel.
Sd/- M.V.Ramana Reddy, M.L.A., Proddatur.
Sd/- R.Rajagopal Reddy, M.L.A., Lakkireddypalle.
Sd/- M.Kesava Reddy, M.L.A., Tadpatri.
Sd/- K.Ramachandra Reddy, M.L.A., Nallamada.
Sd/- G.Nagi Reddy, M.L.A., Dharmavaram.
Sd/- K.Sivananda Reddy, M.L.C., Cuddapah.

# Sri Bagh Pact

The following is the text of the Sri Bagh Pact, deriving its name from the famous Garden Villa of Desoddharaka K.Nageswa-ra Rao Pantulu, in Madras, where it was discussed and drawn up.

(Pact between the Rayalaseema representatives and those of Coastal districts from Berhampur to Madras.)

UNIVERSITY: This committee is of the opinion that two University Centres are to be developed under the Andhra University, one at Waltair and the other at Anantapur, so as to distribute the centres of culture over the Andhradesa, and create opportunities for social and cultural intercourse amongst the Andhras and locate colleges in areas favourable to the subjects dealt with.

IRRIGATION: That, to ensure the rapid development of the agricultural and economic interests of Rayalaseema and Nellore on the level of those in Coastal districts, schemes of irrigation should, for a period of ten years or such longer period as conditions may necessitate, be given a preferential claim especially in respect of the utilisation of the waters of Tungabhadra, Krishna and Pennar, giving for ten

years exclusive attention in respect of major projects beneficial to these areas.

That whenever the question of sharing waters arises, the needs of the aforesaid areas be first met and that this policy be implemented as from today in the administration of the province.

LEGISLATURE: That, in the matter of general seats in the Legislature, the distribution shall be generally on an equal district basis.

It is agreed that the location of the University, the Headquarters and the High Court may advantageously be in different places so as not to concentrate all civic importance at the same centre. Accordingly, it is agreed that, while the University may continue to be where it is (Waltair), the High Court and the metropolis be located in suitable place in the Coastal districts and the Rayalaseema (including Madras), the choice being given to the Rayalaseema.

It shall, however, be open to vary these terms by common consent.

Sd/- K.Koti Reddy,
(Chairman of the committee).
Sd/- Kalluru Subba Rao.
Sd/- H.Sitarami Reddy.

Sd/- B.Pattabhi Seetaramaiah.
Sd/- Konda Venkatappayya.
Sd/- Pappuri Ramacharlu.
Sd/- R.Venkatappa Naidu.
(December, 1937)

# నెత్తురుపొంగు

రాయలేలిన సీమ రతనాల సీమ. కళాకారులకు కనకాభిషేకాలు చేసిన సీమ. శిల్పుల ఉలినుండి రాలిన పొడిరాతికి ఎత్తుకుఎత్తు బంగారంతో సత్కరించిన సీమ. అంగళ్ళలో అమ్మిన రతనాలను పిడికిళ్ళతో బేరం చేసిన ఐశ్వర్యంతో దక్షిణాపథాని కంతా తలమానికంగా తులతూగిన సీమ. కానీ, ఈనాడు ఈసీమ కటిక దారిద్ర్యంతో కట్టుబట్ట లేక, కడుపునిండా తిండిలేక, కరువులపాలై తల్లడిల్లుతూంది. అలనాడు ఆంధ్రదేశానికంతా అన్నం పెట్టిన ఈ సీమను సాటి మానవులనుకున్నవారూ తోటిసోద రులనుకున్నవారూ వెన్నుపోటు పొడిచి విర్రవీగుతున్నారు. పాలుతాగిన రొమ్మును గాయపరిచి చంకలు గుద్దుకుంటున్నారు. అన్నం పెట్టిన చేతికి ద్రోహంచేసి ఐశ్వర్యాన్ని దోచుకుంటున్నారు. తుంగభద్రా సముత్తుంగ తరంగాలతో, కృష్ణవేణమ్మ గల గలారావాలతో, పినాకినీ ప్రవాహవీచికలతో బంగారుపంటలు పండించిన రాయల సీమకు, నేడు తాగటానికి మంచినీరు కరువైంది. ఏమయ్యాయి తుంగభద్రా తరంగాలు? ఎందుకు వినిపించడంలేదు కృష్ణవేణీ గలగలలు? ఏ తీరం చేరుకున్నాయి పెన్నా ప్రవాహవీచికలు? లేదు; ఎక్కడికీ పోలేదు. ఆ మహానదులు నిస్వార్థంగా ఎప్పటిలాగే రాయలసీమ గుండా ప్రవహిస్తూనే వున్నాయి. స్వార్థపరులైన దాయాదులు వాటి ఫలితం రాయలసీమకు దక్క కుండా కుట్రచేసి, వాటి జీవకళలు దోచుకున్నారు. మల్లేశ్వరంవద్ద మహో న్నతమైన ఆనకట్ట ద్వారా అనంతపురంలోని ప్రతి అంగుళాన్నీ పునీతం చెయ్యవలసిన తుంగభద్ర, సర్కారుసోదరుల కుట్ర ఫలితంగా చిల్లిముంతగా మారింది. కృష్ణా పెన్నా నదుల మహత్తర సంగమం ద్వారా కర్నూలు, కడప, చిత్తూరు జిల్లాలను పావనం చేయవలసిన కృష్ణనీరు నందికొండకు దొంగిలించబడింది. గండి కోట వద్ద నిలిచి కడపజిల్లాను ఆశీర్వదించవలసిన పెన్నానది, నెల్లూరు మండలానికి బలాత్కారంగా బానిస చేయబడింది. రాయలసీమవాసుల అమాయకత్వాన్ని ఆధారం చేసుకొని, ప్రాణాధారమైన జలరాసినంతా కోస్తాజిల్లాలకు సాగనంపారు. రాయలసీమను కరువుల తల్లికి అప్పగించి, కొంగు బంగారంతో కేరింతలు కొడుతున్నారు. ఆదరించి అన్నం

పెట్టిన సీమను మోసగించి పరిహాసం చేస్తున్నారు. నదీమతల్లుల మిగులు జలాలు సముద్రంపాలైనా సరేగాని, రాయలసీమకు ఉపయోగపడటాన్ని సహించబోమని శపిస్తున్నారు. నెల్లూరుకు నీరు చాలదన్న నెపంతో పెన్నానది మీద గాని, దాని ఉపనదులమీద గాని అడ్డుకట్టలెక్కడా కట్టరాదని రాయలసీమ వారిని శాశిస్తున్నారు. ఒకవైపు, సంఖ్యాబలంవల్ల కలిగిన అధికార మదంతో, దక్షిణాపథాన్ని అజేయంగా పరిపాలించిన రాయలసీమ శౌర్యప్రతాపాలను చిన్నబుచ్చుతూ, మరోవైపు మిఠాయిగంగలతో రాయలసీమ ప్రజలకు నల్ల మందు మేపి జోకొట్టడానికి ప్రయత్నిస్తున్నారు. నదీజలాలలో రాయలసీమకు రావలసిన న్యాయమైన వాటాను ఎన్ని తెలుగు గంగలైనా, మరెన్ని ఆకాశగంగలైనా తీర్చలేవు.

అంతటితో ఆగలేదు సర్కారుసోదరుల దురంతం. అష్టదిగ్గజాల పాండితీప్రకర్షతో భువనమోహనమైన రాయలసీమకు చదువులతల్లిని గూడా కొదువ చేశారు. రాష్ట్రంలో వచ్చిన ఆదాయమంతా కోస్తాజిల్లాలకే ఖర్చుచేసి, కళాశాలలను నిర్మించారూ విశ్వవిద్యాలయాలను నెలకొల్పారు. రాయలసీమకు మాత్రం తిరుపతి దేవుని ఖజానానుండి ఏర్పాటైనదే తప్ప, సంపూర్ణత సంతరించుకున్న వొక్క విశ్వవిద్యాలయ మైనా లేకుండా చేశారు. ప్రధాన పట్టణాల్లో సైతం నేటికీ తగినన్ని విద్యాలయాలు లేకుండా చూశారు. పేదరికానికి తోడు అజ్ఞానంతో అలమటిస్తూ దాయాదులకు ఊడిగం చేసే స్థితికి రాయల సీమ బిడ్డలను దిగజార్చారు. ప్రభుత్వం వారి అధీనంలో వున్న అవకాశాన్ని వినియోగించుకుని రాయలసీమ ప్రజలకు ఉద్యోగాలుగూడా దక్క కుండా చేశారు. మనమంతా వొకటేనని నమ్మించి 'జై ఆంధ్ర' ఉద్యమానికి ఉసిగొల్పారు. 'విశాఖ ఉక్కు మన జన్మహక్కు' అని కేకలు వేయించారు. విశాఖ ఉక్కులో రాయల సీమవాసుల ఉద్యోగాల హక్కు ఏమైపోయింది? రాయలసీమ ప్రజల రక్తతర్పణంతో సంపాదించిన రాష్ట్రప్రభుత్వ ఉద్యోగాలలో రాయలసీమ వాటా ఎవరికి దక్కింది? ఈ ప్రాంతవాసులకు రావలసిన సుమారు 50 వేల ఉద్యోగాలు కోస్తా ఆంధ్రులు కాజేశారు. రాయలసీమగడ్డమీద గూడా రాయలసీమ బిడ్డలకు ఉద్యోగాలు దక్కే అవకాశం లేకుండా దాయాదుల పాలయ్యాయి. ఈ దారిదోపిడీని చూస్తూ ఊరుకోవలసిందేనా? రాయలసీమకు

జరుగుతున్న ఈ దారుణమైన అన్యాయాన్ని అరికట్టడం సాధ్యంకాదా? చేతిలో ముద్ద నోటి కందకుండా తన్నుకుపోతున్నా రాయలసీమలో చైతన్యం రగులుకోదా? ఇంకా ఎంతకాలం ఈ దుర్మార్గాన్ని సహించాలి? లేదు లేదు. రాయలసీమలో చైతన్యం అణగారిపోలేదు. సహజసంపదగా సంక్రమించిన ఔదార్యంతో ఇంతకాలం సహించి ఊరుకున్నారు. రాయలసీమలో శౌర్యప్రతాపాలు అడుగంటిపోలేదు. తప్పు తెలుసుకుని సోదరులు సరిదిద్దుకుంటారనే ఆశతో ఇంతకాలం ఎదురుచూశారు. ఆశలు నిరాశలయ్యాయి. ఔదార్యం బూడిదపాలయింది. అదిగో, గజపతులను గడగడలాడించిన ఉక్కుపిడికిలి బిగుసుకుంటూంది. అదిగో, బహమనీ గుండెల్లో గుభేలుమనిపించిన శంఖారావం వినిపిస్తూంది. అదిగో, భువనవిజయాన్ని సాధించిన రాయలసీమ కరవాలం కదనరంగానికి సమాయత్తమౌతూంది. రాయలసీమను కటిక దారిద్ర్యానికి కట్టిపడవేసిన దాస్యశృంఖలాలను కసితీరా ఛేదించే సమయం ఆసన్నమైంది.

జై రాయలసీమ!

(డిసెంబర్ 22, 1984)






రాయలసీమ సమస్యల్లో కొన్నిటి పరిష్కారానికై రచయిత ఆమరణ నిరాహారదీక్ష చేస్తూ, రాయలసీమ వ్యాప్తంగా తిరిగి సమావేశాలూ, బహిరంగ సభల ద్వారా ప్రచారం చేస్తున్న దృశ్యాలు


రాయలసీమ లో
కరువు, దారిద్ర్యం
శాశ్వతంగా నివారించటానికి
• కృష్ణా జలాల్లో బచావత్ అవార్డు ద్వారా ఆంధ్రప్రదేశ్ కు సంక్రమించిన 800 టి.ఎం.సి నీటి నుండి రాయలసీమకు కనీసం 350 టి.ఎం.సి. కేటాయించాలి
• మొత్తం ప్రభుత్వ యంత్రాంగం లో రాయలసీమ వాసులకు 20 శాతం ఉద్యోగాలు వుండేట్లు సవరించాలి
• రాష్ట్ర బడ్జెట్ లో కనీసం 10 సం॥ల వరకు 50 శాతం నిధులను రాయలసీమ కు కేటాయించాలి
రాయలసీమ సమస్యల
తక్షణ పరిష్కారం కోరుతూ
1985 జనవరి 1 నుండి
రాయలసీమ విమోచన సమితి కన్వీనర్
యం.వి. రమణారెడ్డి
ఆమరణ నిరాహారదీక్ష
రాయలసీమ లో
కరువు, దారిద్ర్యం
శాశ్వతంగా నివారించటానికి
• రాయలసీమ కోసం ముద్దనూరు వద్ద 250 మెగావాట్ల థెర్మల్ విద్యుత్ కేంద్రాన్ని నెలకొల్పి సరఫరా విధానాన్ని మెరుగు పరచాలి
• రాయలసీమలో విద్యాలయాల నెలకొల్పటానికి కార్పస్ ఫండును తొలగించాలి
• చట్టబద్ధమైన అధికారాలు సిబ్బంది కలిగిన రాయలసీమ డెవలప్‌మెంట్ బోర్డును ఏర్పాటు చేయాలి



నిరాహార దీక్ష విరమింపజేయటానికి ప్రభుత్వం తరఫున
హామీపత్రం సంతకం చేస్తున్న
సహకార శాఖామాత్యులు శ్రీ కరణం రామచంద్రరావుగారు.

# రాయలసీమ తక్షణావసరాలు తీర్చాలని ఆమరణ నిరాహారదీక్షకు ఉద్యమించిన రమణారెడ్డిని దీక్ష విరమింపజేసే నిమిత్తం తెలుగుదేశం ప్రభుత్వం ఇచ్చిన హామీ పత్రం.

హైదరాబాదు,
21-1-1985.

డా. ఎం.వి.రమణారెడ్డి గారికి,

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తరఫున సహకారశాఖామాత్యులైన శ్రీ కరణం రామచంద్రరావుగారు ప్రొద్దుటూరు తెలుగుదేశం మాజీ ఎం.ఎల్.ఏ. డా.ఎం.వి. రమణారెడ్డిగారైన మిమ్ములను ఈ దినం ప్రొద్దుటూరు తెలుగుదేశం పార్టీ కార్యాలయంలో కలుసుకొని రాయలసీమ సర్వతోముఖాభివృద్ధికి గాను గౌ. ముఖ్యమంత్రిగారు తీసుకున్న నిర్ణయాలు వివరించడం జరిగింది. రాయలసీమ ప్రాంతమునకు తెలుగుదేశ ప్రభుత్వ హయాములో చేపట్టిన భారీ నీటి ప్రాజెక్టులు, బడ్జెట్ కేటాయింపులు, మంజూరు కాబడిన కళాశాలలను గూర్చి మొదలైన అన్ని వివరములు వివరించబడినవి. ఇవిగాక ఈ క్రింది వివరాలుగూడా నిర్ణయించబడినవి -

1. కృష్ణా జలాలను రాయలసీమ జిల్లాలలోని దుర్భిక్ష ప్రాంతాలకు తరలించి అవసరమైన నీటిపారుదల ప్రాజెక్టులను చేపట్టడం జరిగింది. మరి పరిశీలనలో వున్న అన్ని ప్రాజెక్టులను కూడా సత్వరం చేపట్టడం జరుగుతుంది. ఇవేగాక భవిష్యత్తులో కూడా శాశ్వత క్షామనివారణకు, శీఘ్రతర పురోభివృద్ధికి దోహదపడగల విధంగా అవసరమైన నీటికేటాయింపు, ఆర్థిక వనరుల సమీకరణతో నీటి పారుదల పథకాలను చేపట్ట గలదు.

2. రాష్ట్రంలో అన్ని వెనుకబడిన ప్రాంతాల సమమైన సమగ్రమైన అభివృద్ధి ఈ ప్రభుత్వ ధ్యేయం. నిరంతర కృషి ఈ పవిత్రాశయం నెరవేరేవరకు ప్రభుత్వం విశ్రమించదు. ఏడవ పంచవర్ష ప్రణాళికలో భారీ ప్రాజెక్టులపై వెచ్చించే మొత్తంకాక అదనంగా రాయలసీమకు రాష్ట్ర ప్రణాళికా బడ్జెటులో 22.4 శాతం కేటాయించబడుతుంది.

3. సుదరేశన్ ఏకసభ్య కమిషన్ రిపోర్టును 6 నెలల లోపల గాని,

వీలైతే అంతకంటే ముందుగాని ప్రభుత్వానికి అందింపజేసిన వెంటనే కమీషన్ చూపెట్టిన లోపాలను పరిశీలించి ఆరు సూత్రాల అమలులో జరిగిన అవక తవకలను ఆరునెలల లోగా ప్రభుత్వం సరిదిద్దగలదు.

4. రాయలసీమలో తగిన సదుపాయాలుగల ప్రాంతంలో 250 మెగావాట్ల సూపర్ థర్మల్ విద్యుత్ కేంద్ర నిర్మాణాన్ని ఏడవ పంచవర్ష ప్రణాళికా కాలంలో ఏర్పాటు చేయడానికి తగిన ఆర్థికవనరులు సమకూర్చుతుంది.

5. క్షామ పీడిత మరియు వెనుకబడ్డ ప్రాంతాలలో కార్పస్ ఫండు చెల్లింపుకై ఆపకుండా గత రెండు సంవత్సరాలలో జూనియర్ మరియు డిగ్రీ కళాశాలలు అనుమతించబడ్డాయి. భవిష్యత్తులో కూడా కార్పస్ ఫండు చెల్లింపునకు పట్టుపట్టకుండా అవసరమైన చోట్ల కళాశాలలను అనుమతించడం జరుగుతుంది.

6. వెనుకబడిన ప్రాంతాల సర్వతోముఖాభివృద్ధి కోసం అన్ని కార్య క్రమాల రూపకల్పన, అమలు, బాధ్యత, చట్టరీత్యా ఏర్పాటైన జిల్లా ప్లానింగ్ బోర్డులకు అప్పగించి సదరు బోర్డుల కార్యనిర్వహణను రాష్ట్ర ప్రణాళికా బోర్డు క్రమంగా సమీక్షించ గలదు.

పై రాయలసీమ సమస్యల పరిష్కారము కొరకు అంగీకరించిన విధంగా ప్రభుత్వము సత్వర చర్యలు తీసుకొనగలదు.

(సం.) x x x x.

Karanam Ramachandra Rao

Minister for Coop.

గమనిక: ఒక్క థర్మల్ కేంద్రం ఏర్పాటులో తప్ప, పై అంగీకారంలోని ఏ ఒక్క అంశానికీ ప్రభుత్వం కట్టుబడలేదు. ఐనా, శ్రీబాగ్ ఒడంబడిక తరువాత 48 సంవత్సరాలకు, రాయలసీమకు అందుబాటైన వ్రాతమూలకమైన ఈ ఏకైక ఆధారాన్ని ఉపయోగించుకొని, ఆ తరువాత ఐదేళ్ళపాటు పరిపా లించిన తెలుగుదేశం ప్రభుత్వం మీద ఒత్తిడి తీసుకురావటానికి, అసెంబ్లీలో గానీ అసెంబ్లీ వెలుపల గానీ ఏ ఒక్క రాజకీయ నాయకుడు ప్రయత్నించక పోవడం రాయలసీమ రాజకీయాల ప్రత్యేకత!

పుస్తకరూపంలో ఎం.వి.రమణారెడ్డి రచనలు:

## 1. తెలుగు సినిమా - స్వర్ణయుగం

(అలనాటి చలనచిత్రాల సమీక్ష)

వెల: రు.100/-

## 2. పురోగమనం

(నవచైనా సామాజిక జీవితం గురించి ఒక బ్రిటిష్ డాక్టరు
పరిశీలనకు అనువాదం)

వెల: రు.80/-

## 3. రెక్కలు చాచిన పంజరం

(హెన్రీ షారియర్ రచించిన 'పాపియాన్' నవలకు అనువాదం)

వెల: రు.200/-

## 4. పరిష్కారం

(కథల సంపుటి)

వెల: రు.60/-

## 5. ఆయుధం పట్టని యోధుడు

మార్టిన్ లూథర్ కింగ్ (జూ) జీవితచరిత్ర

వెల: రు.80/-

## 6. తెలుగింటికొచ్చిన ద్రౌపది

వెల: రు.100/-

## 7. చివరకు మిగిలింది?

('గాన్ విత్ ద విండ్' నవలకు అనువాదం)

వెల: రు.200/-

ప్రతులకు: డా.ఎం.వి.రమణారెడ్డి, ఖాదరాబాద్ (పి.ఒ.), ప్రొద్దుటూరు-516362.

రాయలసీమకు జరిగిన అన్యాయం గురించి, ముఖ్యంగా రైతుకు జరిగిన ద్రోహం గురించి, పుడమితల్లికి జరిగిన దారుణం గురించి, చిరకాలంగా, ప్రజా హృదయం ఇప్పటికీ క్షోభిస్తూనేవుంది; ఉద్విగ్న మౌతూనేవుంది; ఆక్రోసిస్తూ నేవుంది .... ఇది వ్యక్తిగతమైంది కాదు - సామాజికమైనది. ఈ క్షోభకూ, ఉద్విగ్నతకూ, ఆక్రోశానికీ అక్షరరూపమంటూ ఇస్తే, అది ఎలా వుంటుందీ అంటే, ఇదిగో ఈ పుస్తకంలా ఉంటుంది.

-- సింగమనేని నారాయణ

తరతరాలుగా అన్యాయానికీ, అసమానత్వానికీ, రాజకీయ దళారీ తనానికీ దగాపడుతున్న సీమలో పీడితుల తరఫున నిలబడి, ఉద్యమ స్వరాన్ని వినిపించిన మాగ్నాకార్టా ఇది. రాష్ట్రపతులూ, ప్రధానులూ, ముఖ్యమంత్రులూ, ప్రతిపక్ష నేతలూ . . ఇలా పెద్దపెద్ద హోదాల్లో వెలిగిపోయినవారికి జన్మ నివ్వడమో, నిలబెట్టడమో, గెలిపించడమో చేసిన సీమ మట్టికి మిగిలింది గాలికెగిరిపోయే దుమ్ము, గాలి కాలాలూ, నీటిమీద రాతలూ!

-- అఫ్సర్